

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక- ౨౦

**12-08-2023**



వరదరాజస్వామి, కాంచీపురం




'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయసూచిక

# 1. శ్రీ భాష్య వైభవం–1

ఈ వ్యాసాన్ని అనుగ్రహించినవారు –మహావిద్వాంసులైన ఉ. వే. శ్రీమాన్. ఏ. వి. గోపాలచార్య స్వామివారు. వీరు తిరుచినాపల్లి వాస్తవ్యులు. వీరు పరమపదించి ఇప్పటికి సుమారు 60 సంవత్సరాలు పైన అయినది. వీరు వృత్తిరీత్యా న్యాయవాది అయినప్పటికీ, ఉభయవేదాంతాలలో, సంస్కృత, ద్రావిడ, ఇంగ్లీషు భాషలలో చాలా లోతైన పాండిత్యాన్ని కలవారు. సంస్కృత భాషలో, ద్రావిడ భాషలో ఎన్నో గ్రంథాలను రచించారు. వీరి వేదాంత శాస్త్రావగాహనం చాలా గంభీరమైనది. పలు వేదాంత దేశికుల స్తోత్రాలకు చాలా అందమైన వ్యాఖ్యానాలను ద్రావిడ భాషలో, సంస్కృత భాషలో రచించారు.

1930 సంవత్సరంలో శ్రీ భాష్యం, దాని వ్యాఖ్యానం అయిన శ్రుతప్రకాశికలో చతుఃసూత్రివరకు ఉండే భాగానికి ద్రావిడ భాషలో అనువాదం ముద్రింపబడింది. ఈ అనువాదాన్ని శ్రీమాన్ టీ. వి. శ్రీనివాసాచార్యులవారు రచించారు. ఈ గ్రంథానికి ఒక అద్భుతమైన ఉపోద్ఘాతాన్ని శ్రీమాన్. ఏ. వి. గోపాలాచార్యస్వామివారు ద్రావిడ భాషలో రచించారు. ఇందులో శ్రీ భాష్య వైభవానికి సంబంధించి, ఆ గ్రంథానికి అద్వితీయ వ్యాఖ్యానమైన శ్రుతప్రకాశికలోని వైభవాన్ని గురించి పలు రస్యమైన విషయాలను తెలియజేశారు. ఆ వ్యాసం ఇప్పుడు ఆంధ్ర భాషలో అనువదించి, ఆస్తిక ప్రపన్నులకు సమర్పింపబడుతున్నది.



## శ్రీ భాష్య వైభవం

సంస్కృతభాషలో దర్శనం అని మతానికి పేరు. వస్తువులను చూపే కంటికి కూడా పేరు. చాలా గొప్ప గతికి దారి చూపడం దర్శనకార్యం. ఆత్మ యొక్క ఉన్నతమైన క్షేమానికి కన్ను వలె ఉండి, దారిని చూపించడం వల్ల దర్శనం అనే పేరు వచ్చింది. ఇంద్రియాలకు, మనోజ్ఞానానికి అందని పరతత్వం, ధర్మం మొదలైనవానిని మనకు తెలియజేసేది వేదం –అనేది వైదికుల సిద్ధాంతం. వేదాన్ని కొంచెం కూడా ఒప్పుకోని మతాలను బాహ్యదర్శనాలు అని వ్యవహరిస్తారు. బాహ్యమతాలు అనే పదం వేదానికి విరుద్ధంగా ఉండే మతాలను తెలియజేస్తుంది. బౌద్ధమతం, జైనమతం అనేవి మన దేశంలో పుట్టినవి అయినప్పటికీ, ఆ మతానికి ఉండే ప్రాచీనమైన సూత్రాలు, గ్రంథాలు సంస్కృత భాషలో, దాని వికారాలైన పాళి, మాగధి మొదలైన ప్రాకృత భాషలలోనూ ఏర్పడినవి అయినప్పటికీ, వేదాన్ని ప్రమాణం కాదని తిరస్కరించినందున, ఆ మతాలు వేదబాహ్యాలు అని చెప్పబడుతున్నాయి. వేదాన్ని ఒప్పుకోని చార్వాకం మొదలైన దర్శనాలు కూడా బాహ్యమతాలే. శ్రీసాయణాచార్యులవారి సర్వదర్శన సంగ్రహంలో బాహ్యదర్శనాలను గూర్చి కూడా వ్యాసాలు రచింపబడ్డాయి. ప్రాచీనకాలంగా ఆరు దర్శనాలకు షడ్దర్శనాలు అని పేరు. అవి ఏమంటే, సాంఖ్యం, యోగం, గౌతమీయం, వైశేషికం, మీమాంస, వేదాంతం అనేవి ఈ ఆరు దర్శనాలు. ఈ దర్శనాలలో చివరి రెండు దర్శనాలు వేదప్రామాణ్యాన్ని పూర్తిగా అంగీకరిస్తున్నాయి. మిగిలిన నాలుగు, తమకు ఇష్టమైన వేదవాక్యాలను మాత్రం తమ మతానికి ఆధారంగా ఒప్పుకున్నాయి. వేదంలోని ప్రామాణ్యాన్ని పూర్తిగా ఒప్పుకోనందున అవి కూడా బాహ్యాలు అని కొందరు చెప్పడం ఉన్నది. మీమాంసాదర్శనంలో కర్మకాండకు ప్రాధాన్యాన్ని చెబుతారు. కర్మలను అనుష్ఠించడానికి కర్త తప్పక ఆవశ్యకం కనుక, కర్మలకు ద్రవ్యాలవలె, కర్త శేషం కనుక, కర్మానుష్ఠానానికి శేషంగా ఉండే కర్త యొక్క స్వరూపం తెలుసుకోవడం కోసం మాత్రం వేదాంతాలు ఉపయోగపడుతున్నాయి అని, వేదాంతాలు స్వతంత్రంగా ప్రమాణాలు కావు –అని, జ్ఞానం కర్మకు అంగమని, వేదాంతాలు చెప్పే విధంగా ఆత్మజ్ఞానానికి కర్మ అంగం కాదని పూర్వమీమాంసకులు అంటారు. వ్యాసుని కాలంలో ఈ ఆరు మతాలు ప్రవర్తించాయి. తరువాత వేదాంతం తప్ప, మిగిలిన 5 దర్శనాలు చిరకాలంగా ప్రకాశం లేకుడా అంతరించిపోయాయి.

ఆగమాలు అనే పేరుతో పాంచరాత్రం, పాశుపతం, శాక్తం అనే తంత్రాల గ్రంథాలను చెబుతారు. పాంచరాత్రం మాత్రం వైదికమైన వేదాంతానికి అనుకూలమని, అది

వేదాంతంతో చేరినదని శ్రీరామానుజులు, శ్రీమధ్వాచార్యులు భావించారు. శ్రీశంకరాచార్యులు పాంచరాత్రంలో వ్యూహప్రక్రియను చెప్పే చోట మాత్రం ప్రమాణం కాదు –అని, మిగిలిన అంశాలలో అంతటా ప్రమాణం– అని సూత్ర భాష్యంలో చెప్పారు. సహస్రనామాధ్యాయంలో. "చతుర్వ్యూహః" అనే నామాన్ని వ్యాఖ్యానం చేసే సందర్భంలో భగవంతుడు వాసుదేవుడే నాలుగు వ్యూహాలను పరిగ్రహించాడు– అని తెలియజేస్తుంది. వ్యాసస్మృతి వచనాన్ని ఉదాహరించి, చక్కగా వ్యూహాలు పరమాత్మ యొక్క రూపాలు అని చెబుతారు. అద్వైత సంప్రదాయంలో ప్రసిద్ధ గ్రంథం అయిన కల్పతరువులో పాంచరాత్ర ప్రామాణ్యాన్ని మనం ఏ విధంగా ఒప్పుకుంటున్నామో, ఆ విధంగానే సమర్థించడం జరిగింది. పాశుపతాగమం మొదలైనవి వేదాంతానికి అనుకూలం కాదు అని సూత్రకారులు తిరస్కరించారు. కొందరు అవలంబిస్తున్న వైదిక మతాలలో వేదాంత దర్శనం ఒకటే ప్రసిద్ధంగా ప్రకాశిస్తున్నది. ఈ దర్శనానికి వేదాంతాలు అనబడే ఉపనిషత్తులు మూల ప్రమాణం అవుతున్నాయి. వేదంలోని నిర్ణయం చేసే భాగానికి వేదాంతం అని పేరు. జ్ఞానంలోని నిర్ణయం– అని వేదాంతానికి అర్థం పొసగుతుంది. వేదాంతానికి మించిన శాస్త్రం లేదు –అని అంటారు. ఉపనిషత్తులలోని అభిప్రాయాలను స్పష్టంగా తెలుపడం ఉపబృంహణాలు అనే శ్రీరామాయణం, మహాభారతం శ్రీవిష్ణుపురాణం మొదలైన ఇతిహాసపురాణాల కార్యం. ఇతిహాస పురాణాలచేత వేదాంతాలను తెలుసుకోవాలి. అల్పంగా వేదాలను అభ్యసించినవానిని చూచి, "అయ్యో! ఇతడు నాకు తప్పైన అర్థాలను చెప్పడం ద్వారా నన్ను మోసగిస్తాడో ఏమో! "అని భయపడుతున్నది –అని అంటారు. ఉపబృంహణాలను. స్మృతులని అనుమానాలని సూత్రకారులు వ్యవహరిస్తారు. వేదాన్ని ప్రత్యక్షమని, స్మృతులను అనుమానమని వ్యవహరిస్తారు. వేదాలలోని అర్థాలు స్మృతులలోనూ తెలియకుండా, స్మృతులకు కూడా పలు అర్థాలు తోచేచేటట్లయితే, వేదార్థాలను తీర్మానించడం కోసం న్యాయసంచారం చేయడం మీమాంస అనబడుతుంది.

మీమాంస అనేది ఉన్నతమైన విషయాన్నిగూర్చి చేసే విచారాన్ని చెబుతుంది. జిజ్ఞాస అనేది ప్రేమతో, భోగ్యతాబుద్ధితో విచారించి నిర్ణయం చేయాలనే ఆశను చెబుతుంది. లక్షణావృత్తితో అది విచారమనే మీమాంసను చెబుతుంది– అని కొందరు అంటారు. ధర్మం అనేది మన శ్రేయస్సుకు సాధనంగా వేదంచేత విధించబడేదాన్ని, తెలియబడదగినదాన్ని తెలుపుతుంది. సాధనాన్ని ఉపాయమని అంటారు. ధర్మం అనేది సిద్ధమని, సాధ్యమని రెండు రకాలుగా ఉంటుంది. భగవంతుడు సిద్ధమైన ధర్మం. మన సకల శ్రేయస్సులను సాధించే ధర్మాలు సాధ్యోపాయాలు అనబడతాయి. సాధించే ధర్మంచేత సిద్ధించేవాడైన

భగవంతుడు సంతోషింపజేయబడి, అతడు ఆ కర్మలకు ఫలాన్ని ఇవ్వాలి. సాధ్యమైన ధర్మాలే నేరు అదృష్టాన్ని కలిగించి, ఫలాన్ని ఇచ్చేటట్లు చేస్తున్నాయి –అని పూర్వమీమాంసకులు అంటారు. ఆ కర్మలచే ఆరాధింపబడేవాడైన భగవంతుడే ఫలం ఇస్తున్నాడు– అని సూత్రకారుల మతం "కృష్ణం ధర్మం సనాతనమ్"అని, సిద్ధధర్మమైన భగవంతుడే ధర్మం –<అని చెప్పబడుతున్నది. వేరు ప్రమాణాల చేత తెలియడానికి సాధ్యం కాని ఈశ్వరునివంటి వస్తువును వేదంలో ఏకదేశమైన వేదాంతాలు ప్రమాణంగా తెలియజేస్తున్నాయి– అని సమన్వయాధికరణలో తెలియజేయబడింది. ధర్మాలను తెలియకోరిన జిజ్ఞాసువులకు వేదమే గతి–అని శాస్త్రం చెబుతున్నది. ధర్మవిషయంలో వేదంలోని యథార్థమైన తాత్పర్యాన్ని నిర్ణయం చేసికోవడానికి మీమాంస అంగం అవుతున్నది. వేదం అందులో సాధనం. మీమాంస అనే విచారం అంగం. వేదాంతవిచారమైన మీమాంస మొత్తం ఒకే శాస్త్రం –అనేది శ్రీరామానుజుల అభిప్రాయం.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" – "తరువాత బ్రహ్మవిచారాన్ని చేయాలి" అనే మొదటి సూత్రంతో శాస్త్రారంభాన్ని సమర్థనం చేయడానికి శాస్త్ర కారులు ఆరంభిస్తున్నారు. "తరువాత ఒక మీమాంస ఆరంభింపబడుతున్నది" అని ఇక్కడ చెప్పడం చేత, దానికి ముందు ఒక మీమాంస జరిగిందని, దానికి తరువాత ఇంకా ఒక మీమాంస ఆరంభమవుతున్నదనే అర్థాన్ని గ్రహించడం స్వరసమని శ్రుతప్రకాశికలో తెలుపబడింది. పూర్వతంత్రం అని అద్వైత గ్రంథాలలో పూర్వ మీమాంసను చెప్పడం సంప్రదాయం. పూర్వతంత్రంలో చెప్పిన విషయాన్ని మళ్లీ ఇక్కడ చెప్పడం ఎందుకు? అని శ్రీ శంకర భాష్యంలో కూడా పునరుక్తి దోషాన్ని శంకించి పరిహారం చెప్పబడింది. శ్రీమధ్వమతంలోనూ, భగవద్రామానుజుల మతంలోనూ రెండు మీమాంసలు వేదార్థవిచారణను చేసే ఒకే శాస్త్రం– అని అభిప్రాయపడడం జరిగింది. ఈ విధంగా, ఒకే శాస్త్రమై ఉన్నప్పటికీ, మన స్వరూపజ్ఞానం కోసం అవశ్యం ఉపాదేయమైన ఉత్తర మీమాంసకే ఈ నాలుగవ యుగంలో మనకు అవకాశం లభించడం అరుదు కనుక, పూర్వ భాగంలో ఆరంభించకుండా, చివరి భాగంలోనే ప్రవేశిస్తున్నాము– అని దేశికుల అధికరణ సారావళిలో చెప్పబడినది.

ఆరు దర్శనాలకు కావలసిన ఆధారాలను, యుక్తులను చూపడం ద్వారా స్వమతంలోని ముఖ్యమైన అంశాలను స్పష్టతకు లోటు లేకుండా ఉండే విధంగా, భ్రమ, సంశయాలు లేని రీతిలో సూత్రాలు అనే క్లుప్తమైన వాక్యాలతో ఆ యా దర్శన ప్రవర్తకులు అయిన సూత్రకారులచే గ్రంథాలు రచింపబడ్డాయి వేదాంత దర్శనానికి సూత్రకారులు

వ్యాసులు అనే పేరు కలిగిన బాదరాయణులు. సూత్రం అనేది గ్రంథానికి పేరు. ఒక దర్శనానికి నిర్దిష్టమైన మార్గాన్ని ఏర్పరచడం సూత్ర గ్రంథాలు చేసే పని. ఒక వస్తువు యొక్క పరిమితిని తెలుసుకొని, దానిని పరిచ్ఛేదించి పలుకడానికికూడా స్తోత్రమనే గ్రంథం ఆవశ్యకం. తత్త్వాలను పరిచ్ఛేదించడం వల్ల సూత్రం అనే పేరు చక్కగా ఏర్పడింది. –అని చెప్పవచ్చు. వేదాంత వాక్యాలనే పుష్పాలను కూర్చే దారం సూత్ర మనబడుతుంది–< అని శ్రీ శంకర భాష్యంలో చెప్పబడింది. వేదం అనే శబ్దబ్రహ్మమైన త్రయీఅనే దేవికి, ఆమె నాయకుడైన నారాయణుడనే బ్రహ్మతో వివాహం చేసే మంగళసూత్రమే బ్రహ్మసూత్రం–అని చెప్పబడుతున్నది– అని భట్టర్ శ్రీరంగ రాజస్తవ మంగళ శ్లోకంలో ధ్వనింపజేశారు.

బ్రహ్మం అని వేదానికి పేరు, పరబ్రహ్మకు కూడా పేరు. శబ్దబ్రహ్మను, పరబ్రహ్మతో కలిపి బంధించే మంగళ సూత్రం బ్రహ్మసూత్రం అనబడుతున్నది– అని ఇక్కడ ధ్వని. ఉపనిషత్తులు అనే అమృత సముద్రాన్ని సూత్రమనే దారాలతో చిలికి, సారతమమైన అమృతాన్ని సేకరించి, ఉద్ధరించడం వల్ల ఉపనిషత్తులను చిలికి సారాన్ని సమీకరించి తీయడానికి సాధనం అయిన దారాలు బ్రహ్మసూత్రాలు అవుతున్నాయి– అని అధికరణ సారావళి చివరిలో శ్రీ వేదాంతాచార్యులవారు పలికిన సూక్తి. మనసు ద్రవించే రీతిలోని యోజనలలో కూడా సూత్రమనేదానికి దారం అనే అర్థం కూడా ఆదరింపబడుతున్నది. సూచనం చేయడం సూత్రమనేది యోగికమైన అర్థం. సూత్రాలే ఏ దర్శనానికి అయినా మొదటి గ్రంథం. అదే, మార్గదర్శనం చేసే గ్రంథం అవుతున్నది. ఆ సూత్రాలు చాలా సంగ్రహంరూపంలో ఉన్నందున, వాటి అభిప్రాయాలు వార్తికం అనే వృత్తి గ్రంథాలతో వివరింపబడతాయి. పూర్వమీమాంసా శాస్త్రానికి కుమారిలభట్టు రచించిన వార్తికాలు ఉన్నప్పటికీ, దానికి ఉపవర్షుడు వృత్తిగ్రంథాన్ని రచించాడని శాబర భాష్యంలో, శంకర భాష్యంలో, మిగిలిన ప్రాచీన గ్రంథాలలో చెప్పబడింది. పూర్వమీమాంసా సూత్రాలు జైమినిమహర్షి చేత రచింపబడ్డాయి. అతడు వ్యాసుని శిష్యుడని మహాభారతంలో చెప్పబడింది. దానికి భాష్యకారుడు శబరస్వామి. ఉత్తర మీమాంసను శారీరక మీమాంస అని అందరూ వ్యవహరిస్తారు. దానికి వృత్తికారుడు ఉపవర్షుడు అని అద్వైత గ్రంథాల అభిప్రాయమని చెప్పవచ్చు. దీనికి వృత్తికారులు బోధాయనులు అని, ఆ వృత్తి గ్రంథాన్ని ద్రమిడభాష్యకారులు మొదలైన పూర్వాచార్యులు క్లుప్తంగా సంగ్రహించినట్లు, ఆ గ్రంథాలలోని అభిప్రాయాలను అనుసరించి సూత్రాక్షరాలకు భాష్యం తాము రచిస్తున్నట్లు శ్రీ రామానుజులు అనుగ్రహించారు. బోధాయనుల వృత్తి గ్రంథంనుండి, ద్రవిడభాష్యకారుల

భాష్యంనుండి శ్రీ భాష్యంలోనూ, శ్రుతప్రకాశికలోనూ కొన్ని వాక్యాలు ఉదాహరింపబడ్డాయి. శ్రీభాష్యకారులు ఈ గ్రంథాలను కటాక్షించారు అనేది నిశ్చయం. అయితే, ఆ గ్రంథాలు ఇప్పుడు లభించడం లేదు.

శారీరక మీమాంసాసూత్రాలకు మూల ప్రమాణాలు వేదాంతాలు, ఉపబృంహణాలైన స్మృతులు. వేదాంతాల హృదయాన్ని, సూత్రంలోని హృదయాన్ని చక్కగా తెలిసికొన్నవారు, వేదాన్ని ద్రావిడప్రబంధాల రూపంలో అనుగ్రహించినవారైన నమ్మాళ్వారుల ప్రబంధాలు చక్కగా ఉపకరిస్తున్నాయి–అనే విషయాన్ని ఆధ్యాత్మ శాస్త్రంలో పరిశ్రమ చేసినవారు తెలియగలరు. వేదాంతాచార్యులు అనే పేరుతో ప్రసిద్ధులైన దేశికులు "ఆళ్వారుల ద్రావిడ ప్రబంధాలను తెలిసేటట్లుగా తాము అధ్యయనం చేసి, అంతకు ముందు తెలియని వేదంలోని అర్థాలను స్పష్టంగా తెలుసుకున్నాము" అని, తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొదటి రెండు దశకాల చేత బ్రహ్మసూత్రాలలోని అధికరణాలు అన్నీ సంగ్రహింపబడ్డాయి– అని అన్నారు. ఆ విధంగానే పూర్తిగా సంగ్రహింపబడినట్లు విస్తృతంగా పెద్దలచే నిరూపింపబడుతున్నది కూడా. ఆ నిరూపణాలను చూస్తే, శారీరక మీమాంస అంతా ఈ రెండు దశకాలలో యథాక్రమంగా సంగ్రహింపబడినది– అని చక్కగా తెలుస్తుంది. అందులోనూ, మొదటి పాశురంలో నాలుగు అధ్యాయాల విషయాలను నాలుగు పాదాలతో సంగ్రహించారు "ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్" అని పరబ్రహ్మ యొక్క లక్షణాన్ని తెలియజేశారు. జ్ఞానానందమయత్వం బ్రహ్మస్వరూపలక్షణం అని అంటారు. ఆనందవల్లిలో అధ్యయనం చేయబడిన బ్రహ్మ యొక్క లెక్కించటానికి సాధ్యం కానిది. వాచామ గోచరమైన ఆనందమయంత్వాన్ని ఆనందమయమైన తమ సహస్రగాథాత్మకమైన ప్రబంధంలో అనుగ్రహించారు జగత్కారణత్వాన్ని లక్షణంగా సూత్రకారులు తెలిపిన రీతిలోనే ఆళ్వార్లు కూడా చెప్పవద్దా? అని ప్రశ్న కలుగవచ్చు. దానికి పరిహారం ఉన్నది. భృగువల్లి ఆరంభంలో భృగువుచే తన పుత్రునకు "దేనినుండి చేతనాచేతన పదార్థాలు అన్నీ పుడుతున్నాయో, పుట్టినవి అన్నీ దేనిచే జీవిస్తున్నాయో, ప్రళయం చెందే కాలంలో అన్నీ ఎందులో లయాన్ని పొందుతున్నాయో, దానిని విచారించాలి, అదే బ్రహ్మం" అని ఉపదేశించారు. ఆ బ్రహ్మలక్షణ ప్రకారాన్ని అనుసరించి అళ్వార్లు కూడా "యవన్, ఆవన్" అని మూడుమార్లు చెప్పారు. ఆ బ్రహ్మం సామాన్యంగా "యవన్, అవన్" అని మొదట చెప్పబడినది అయినా, అది "ఇటువంటిది" అని స్పష్టంగా తెలియలేదు. ఆ కొరత తీరేటట్లు సూక్ష్మంగా "బ్రహ్మం ఇది" అని తెలుపడం కోసం ఆనందవల్లిలో చివర "ఆనందంనుండి ఈ ప్రాణులు అన్నీ పుడుతున్నాయి, పుట్టినవి అన్నీ అందులోనే నిలచి జీవిస్తున్నాయి, ప్రళయ

కాలంలో అందులోనే లయాన్ని పొందుతున్నాయి", "ఆనందమే బ్రహ్మం" అని తీర్మానించే వాక్యాన్ని పలికారు. అందుచేత, ఆనంద శబ్దంచేత చెప్పబడే ఆనందమయుడే జగత్కారణం– అని భృగువల్లిలో తీర్మానింపబడింది– అనే నిశ్చయం ఏర్పడుతున్నది. ఆళ్వారులు మొదటి పాదంలో ఆనందమయ స్వరూపాన్ని చెప్పినందువల్ల జగత్కారణమైన ఆనందాన్ని చెప్పినట్లయినది. సూత్రకారులు జగత్కారణాన్ని లక్షణంగా చెప్పిన దానికి భృగువల్లిలోని చివరిలో తీర్మానించిన క్రమాన్ని అనుసరించి ఆ జగత్కారణం ఆనందమని సూచించడంలో దృష్టి. ఆళ్వార్లు ఈ సూక్ష్మమైన విషయాన్ని వ్యక్తం చేయడం కోసం ఆనందమయుడు– అని భృగువల్లిలో చివరిలో చేసిన తీర్మానాన్ని స్పష్టంగా తెలియజేశారు. పరమాత్మ ఆనందమయుడు –<అనే విషయాన్ని పురస్కరించుకొని కారణత్వాన్ని ఆళ్వార్లు సూచించారు. సూత్రకారులు కారణత్వాన్ని చెప్పి, ఆనందమనే బ్రహ్మస్వరూప లక్షణాన్ని సూచించారు. ఇద్దరికీ ఈ రెండిటిలోనూ తాత్పర్యమే. సూత్రకారులు భృగువల్లి ఆరంభంలోని వాక్యాన్ని ప్రస్తావించారు. అళ్వార్లు ఆ ఉపనిషత్తులో చివరిలో తీర్మానించిన వాక్యాన్ని ప్రస్తావించారు అళ్వార్లు అనుభవంలో అవగాహించాలని భావించి, ఆనంద వాక్యాన్ని తమ శాస్త్రారంభంలో పరిగ్రహించారు.

బ్రహ్మసూత్రాలకు చాలా భాష్యాలు ఉన్నాయి. వాటిలో ప్రసిద్ధమైనవి, ప్రకాశ ప్రచారాలలో ఉన్నవి మూడు. శ్రీకంఠభాష్యం శైవవిశిష్టాద్వైతపరమని ఆ భాష్యంలోని వాక్యాల చేత స్ఫుటంగా తెలుస్తున్నది. ఆరంభణాధికరణంలో. " మనం విశిష్టాద్వైతవాదులం" అని స్పష్టంగా అందులో చెప్పబడింది. ఆ భాష్యం అనేక భాగాలలో శ్రీరామానుజుల శ్రీభాష్యాన్ని అనుసరించినది. ఆ భాష్యం అద్వైతంలోనే తాత్పర్యం కలిగినది– అని నిరూపించటానికి అప్పయ్య దీక్షితులు చాలా శ్రమ పడ్డారు ఆనందలహరిలో శ్లోకరూపంగాను, దానికి వ్యాఖ్యానరూపంగానూ దీనిని నిరూపించారు ఈ విషయంగా వారు రచించిన శివాద్వైతనిర్ణయం అనే గ్రంథం చెన్నైనగరంలోని విశ్వవిద్యాలయం చేత ముద్రింపబడినది. దీక్షితులకు ముందు ఉన్నవారు నీలకంఠ భాష్యాన్ని విశిష్టాద్వైతమతపరం– అనే అభిప్రాయపడ్డారు. శివార్కమణి దీపిక అనే శ్రీకంఠభాష్యవ్యాఖ్యానంలో దీక్షితులు అనేకంగా శిభాష్యానికి, శ్రుతప్రకాశికకు అనుగుణంగానే వ్యాఖ్యానం చేశారు. శ్రీ భాష్యం ముందా? శ్రీకంఠ భాష్యం ముందా? అనే విషయాన్ని గూర్చి ఒక వాదం ఉన్నది కూడా. శ్రీ భాష్యం ముందుది– అని దీక్షితులు శివార్కమణి దీపికలో స్పష్టంగా చెప్పారు. వారికి కూడా ముందున్న అన్యమత గ్రంథాలలో శ్రీ కంఠుడే శ్రీరామానుజమతతస్కరుడని వర్ణింపబడింది. తస్కరుడు అంటే– ఆ

భాష్యంనుండి దొంగిలించాడు –అని అర్థం. శ్రుతప్రకాశిక కాలంలో ఆ భాష్యం ప్రచారంలో ఉన్నదా? లేదా? అనేది సందేహం. ఒక్కొక్క అధికరణం చివరిలో పరమతవ్యాఖ్యానాలను అనువాదం చేసి, వాటినిగూర్చి విచారణ చేయబడింది. శ్రీకంఠభాష్యాన్నిగూర్చి ప్రస్తావించబడలేదు. శ్రుతప్రకాశికకు ముందు మాధ్వ భాష్యం ఏర్పడింది– అనేది నిశ్చయం. ఆ మతాన్ని ప్రస్తావించకపోవడం ఎందుకు అంటే?, అది శ్రీ రామానుజుల దర్శనానికి ముఖ్యమైన తత్త్వభాగాలలో అనుగుణంగా ఉండడమే –అని భావించాలి సూత్రాల అర్థంగా వివరణాన్ని చేసే క్రమంలో చాలా వ్యత్యాసం ఉన్నప్పటికీ, తత్త్వ హిత పురుషార్థాల విషయాల్లో అనేకంగా సమానంగా ఉన్నందున, ఆ భాష్యానికి ప్రతివాదిని చెప్పలేదు. అయితే, సద్విద్యా విచారణలో మాత్రం, ప్రధాన వస్తువు అయిన బ్రహ్మజ్ఞానం చేత అన్నీ నశించేటట్లు ఔపచారికంగా గ్రహించాలి– అని ఆ భాష్యంలో చెప్పబడడాన్ని మాత్రం అంగీకరించడం ఉచితం కాదు –అని సాధించబడింది. మాధ్వమతానికి చెందిన వారిని ఏకాయనులు అని, ఒక విషయంలో మాత్రం వారు మనతో భేదిస్తున్నట్లుగా ఈడు వ్యాఖ్యానంలో అన్నారు. వేదాంతాచార్యులవారు వారి మతాన్ని మనకు సన్నిహితమైన మతమని శతదూషణిలో కూడా" మత్సన్నికృష్టమపి మత మాశ్రయంతః" అనే శ్లోకంలో కూడా అనుగ్రహించారు. పరమతభంగం మొదలైన గ్రంథాలలో శ్రీ కంఠ భాష్యాన్నిగాని, మాధ్వ మతాన్నిగాని ప్రస్తావించలేదు. సుధలోను, చంద్రికలోను ఆ మతానికి సంబంధించిన వాదం కాని, దాని దూషణం కాని లేదు. చంద్రికకు వ్యాఖ్యానమైన ప్రకాశం అనే గ్రంథంలో మాత్రం శ్రీ కంఠభాష్యానికి, శివార్కమణి దీపికకు అనువాదం ఉన్నది. ఆ భాష్యం తరువాత కాలంలానికి చెందినది అనేదానికి ప్రబలమైన కారణాలు వేదాంత దీపికలో అనేక వ్యాసాలలో విస్తృతంగా చూపబడ్డాయి.

శ్రీశంకర భాష్యం భగవద్రామానుజుల శ్రీభాష్యానికి అనేక సంవత్సరాల ముందు రచింపబడింది. ఆ భాష్యాన్ని అంగీకరించకుండా, అందులోని అంశాలను విస్తృతంగా దూషించే విషయంలో ఇప్పుడు ప్రకాశంలో ఉండే గ్రంథాలలో మొదటి గ్రంథాలు శ్రీ యామునుల సిద్ధిత్రయం, ఆగమప్రామాణ్యం అనేవి. సిద్ధిత్రయం సూత్రాల వ్యాఖ్యానంగా ఏర్పడలేదు. పంచరాత్రాధికరణ సూత్రాలు మాత్రం ఆగమప్రామాణ్యంలో వాఖ్యానం చేయబడ్డాయి. బోధాయనవృత్తి, ద్రవిడభాష్యం ఇప్పుడు లభించడం లేదు. బోధాయనుడు, టంకుడు, ద్రవిడుడు, గుహదేవుడు మొదలైనవారు మన దర్శనవిషయంగా, శ్రీరామానుజులకు పూర్వం, గ్రంథాలను రచించినవారు. బోధాయన వృత్తిని శ్రీరామానుజులు కటాక్షించి, దానిని అనుసరించి శ్రీభాష్యం అనుగ్రహించిన విషయం

స్పష్టం. సిద్ధిత్రయం శీభాష్యానికి ఒక ముఖ్యమైన ఆధారం. అందులో ఉండే అనేక వాక్యాలు యథాతథంగా శీభాష్యంలో మొదటి అధికరణంలో గ్రహింపబడ్డాయి. మన దర్శనానికి చెందినవారు అందరూ శీభాష్యాన్ని దానికి, లోకోత్తరమైన వ్యాఖ్యానం అయిన శ్రుతప్రకాశికను అధ్యయనం చేయడం చాలా ఆవశ్యకం. మన దర్శనంలో ఉండే వైభవం శీభాష్యాన్ని, దాని వ్యాఖ్యానగ్రంథాలను సేవిస్తేనే పూర్ణంగా తెలుస్తుంది. ఇతర మతాలవారు అడిగే ప్రశ్నలకు ఈ గ్రంథాల సహాయం లేకుండా సమాధానం చెప్పడం కష్టం.

శ్రీ శంకరభాష్యం ఇప్పటికీ సుమారు 30 సంవత్సరాలకు పూర్వమే జర్మనీ దేశంలోని ఒక సంస్కృత విద్వాంసునిచే చాలా అందమైన ఇంగ్లీషులో అనువాదం చేయబడింది. ఆ అనువాదంలో ఒక్క దోషం కూడా కనిపించదు. వారు కాశీపండితుల సహాయంతో రెండు భాష్యాలను చక్కగా అధ్యయనం చేసినవారు. శ్రుతప్రకాశికలోని విషయాలను గ్రహించినవారు. శంకర భాష్యానికి వారు ఒక విస్తృతమైన అవతారికను రాశారు కూడా. అందులో ఈ రెండు భాష్యాల వ్యాఖ్యానాలను, అనేక అధికరణాలలో ఉండే తేడాలను గమనించి సూచించారు. విస్తారంగా రెండు వ్యాఖ్యానాల స్వారస్యాలను విచారించారు. శ్రీరామానుజుల శ్రీభాష్యం సూత్రకారుల హృదయానికి అనుగుణమైనదని తమ నిర్ణయాన్ని వ్యక్తంగా తెలియజేశారు. ఇద్దరిలో వివాదం ఏర్పడితే, మధ్యస్థుని మాటను పురస్కరించుకొని వాటి సాధుత్వాన్ని నిర్ణయం చేయబడం అనేది ప్రసిద్ధం. సూత్రాక్షరాలకు వ్యాఖ్యానం చేస్తున్నట్లుగా శ్రీభాష్యకారులు రచించిన ప్రతిజ్ఞ ఈ విధంగా ఉండే మధ్యస్థుల నిర్ణయించేత సత్యాపితం అయినది. శ్రుతప్రకాశికా వ్యాఖ్యానంలో చెప్పబడిన సూక్తులను ప్రస్తావించి, వారు చూపించారు కూడా. సుమారు 30సంవత్సరాలకు ముందు శ్రీభాష్యాన్ని వారు ఇంగ్లీషు భాషలో తర్జుమా చేసి, ప్రచారం చేశారు. ఈ అనువాదాన్ని చదివిన ఇతర దేశాలలోని వేదాంతవిచారంలో రుచిని గలిగిన విద్వాంసులు మన మతాన్ని తెలిసికొంటున్నారు. ఇంచుమించుగా ఈ అనువాదం సరిగానే ఉన్నది. 30 సంవత్సరాలకు ముందు ఇంగ్లీషులో ఈ అనువాదం వచ్చినప్పటికీ, " ద్రావిడేషు చ భూరిశః" అనే విధంగా ఆళ్వార్లు అవతరించిన ఈ ద్రావిడ దేశంలో తీయని ద్రావిడ భాషలో ఈ గ్రంథం ఇంతవరకు అనువదింపబడకపోవడం గొప్ప లోపమే అవుతున్నది. శ్రుతప్రకాశికతోపాటు శ్రీ భాష్యాన్ని అనువాదం చేసి ముద్రించి ప్రచారం చేసే మహానుభావులను మనం చాలా కృతజ్ఞులమై పొగడి, మంగళా శాసనం చేయాలి.

శ్రీ భాష్య వైభవాన్ని దీపా అనే జర్మనీ దేశంలోని పండితుడు ఒకరు పొగడడం మాత్రమే కాదు, ఈ దర్శనాన్ని అనుసరించి ఉత్తరదేశంలో నింబార్కులు భాష్యం

రచించారు. వల్లభులు, చైతన్యులు మన దర్శనాన్ని అనేక అంశాలలో అనుసరించారు. మాధ్వసంప్రదాయంలో సూత్రవ్యాఖ్యానాన్ని గూర్చి తర్కించినప్పటికీ, శ్రుతప్రకాశికలో చెప్పబడిన అనేక యుక్తులను విరోధంగా అవలంబించారు. చంద్రికను, శ్రుతప్రకాశికను అనుసరించి చూస్తే ఇది బాగా వ్యక్తం అవుతుంది. విశిష్టాద్వైతపరమైన శ్రీకంఠభాష్యానికి వ్యాఖ్యానమైన శివార్కమణిదీపికలో శ్రుతప్రకాశికలోని యుక్తులు అనుసరింపబడ్డాయి.

శ్రీభాష్యంలోని గొప్పతనాన్ని శ్రీ వేదాంతదేశికులు పలుమార్లు కీర్తించారు. శ్రీ భాష్యాన్ని ప్రవర్తింపచేయడమే శ్రీవైష్ణవులకు ప్రధాన కైంకర్యం అని రహస్య త్రయసారంలో వారు అన్నారు. సంకల్పసూర్యోదయం మొదలైన గ్రంథాలలో తాము ఎంతవరకు, ఎన్ని ఆవృత్తులు శ్రీభాష్యాన్ని కాలక్షేపం చెప్పారో, ఆ విషయాన్ని తెలియజేశారు. తమ కాలం ఏ విధంగా గడిచిందో చెప్పేటప్పుడు, తమ యవ్వనం అంతా యతిసార్వభౌముల శ్రీసూక్తులను ఆవృత్తి చేయడంలోనే పరమ భోగ్యంగా అనుభవింపబడిందని అన్నారు. సంకల్ప సూర్యోదయంలోని రెండవ అంకంలో– "శ్రీభాష్యాన్ని తమ యవ్వనప్రాయం గడవడానికి ముందే చక్కగా అనపాయమైన ప్రీతితో అనుభవించాలి" –అని, ఈ సంసారం అనే చీకటిలో శ్రీ భాష్యం అనే దీపం శ్రీరామానుజులచే వెలిగింపబడిందని అన్నారు. శతదూషణిలోని వాదాలు అనేకంగా శ్రీభాష్యంలో మొదటి అధికరణంలో విచారింపబడిన విషయాలను గూర్చినవే. శ్రీభాష్యాన్ని అనేక ఆవృత్తులు శిష్యులకుతాము అధ్యాపనం చేసి, దాని తరువాతనే అధికరణ సారావళీ గ్రంథాన్ని రచించినట్లుగా వారు తెలియజేశారు.

మన దర్శనాన్ని మనం పొగడుకోవడంలో గొప్ప లేదు. శ్రుతప్రకాశికా వ్యాఖ్యానంలో చెప్పబడిన దూషణాలను అన్యమతస్థులు ఒప్పుకోవడానికి అనుగుణంగా తమ వ్యాఖ్యానాన్ని సంస్కరించడంచేత, శ్రీ భాష్యకారుల శ్రీభాష్యంలో ఉండే యథార్థం, స్వారస్యం చక్కగా తెలుస్తున్నది. ప్రథమాధ్యాయం రెండవ పాదం మొదటి అధికరణమైన సర్వత్ర ప్రసిద్ధోపదేశాధికరణంలో మొదటి సూత్రాన్ని ఒకే పదంగా శంకరభాష్యంలో వాఖ్యానంచేశారు. శ్రీరామానుజుల శ్రీభాష్యాన్ని, శ్రుతప్రకాశికను చక్కగా అధ్యయనం చేసిన అప్పయ్య దీక్షితులు న్యాయ రక్షామణి అనే గ్రంథంలో, మన శ్రీభాష్యంలో వలెనే, రెండు పదాలుగానే విభజించి వ్యాఖ్యానించారు. పాంచరాత్రాధికరణంలో పాంచరాత్రాన్ని సూత్రకారులు కొన్ని అంశాలలో మాత్రం పరమతమని దూషించినట్లుగా శ్రీ శంకర భాష్యంలో చెప్పబడింది. దాని వ్యాఖ్యానమైన, పరమతానికి వ్యాఖ్యానమని చెప్పదగిన కల్పతరు గ్రంథంలో పాంచరాత్రాన్ని సూత్రకారులు దూషించలేదు– అని, అందులో ఆక్షేపింపబడిన అంశాలకు, అంటే, వ్యూహోత్పత్తికి, జీవోత్పత్తికి గౌణంగా అర్థం చెప్పాలని

సమర్థించారు. ఈ వివరణ శ్రీ భాష్యాన్ని అనుసరించినదే అవుతున్నది. ఆనందమయాధికరణలోని సూత్రాలకు శ్రీ శంకర భాష్యంలో చేయబడిన ముందు వ్యాఖ్యానం అయిన రెండవ వర్ణకం సూత్రాలకు నేరుగా విరుద్ధమని, సూత్రాలలోని అర్థం శ్రీభాష్యవ్యాఖ్యానంవంటి వృత్తికారుల వివరణ రీతిలోనిది –అని కల్పతరుగ్రంథంలో అంగీకరింపబడింది. నాలుగవ అధ్యాయం 8వ పాదం చివరిలోని కార్యాధికరణంలో, మొదట సిద్ధాంతాన్ని, తరువాత పూర్వపక్షాన్ని సూత్రకారులు చెప్పినట్లు శ్రీ శంకర భాష్యంలో వ్యాఖ్యానింపబడినది. మొదట సిద్ధాంతరూపక్రమంగా ఒక అధికరణం ప్రవర్తించి, తరువాత పూర్వపక్షాన్ని చెబితే, చివరిలో ఆ పూర్వపక్షాన్ని నిషేధించి, సిద్ధాంతాన్ని చూపాలి –అని శ్రుతప్రకాశికలో నిరూపించారు. ఆ యుక్తి అభేద్యమైనది– అని, దీనిని గౌడ బ్రహ్మానందీయులనే గ్రంథకారులు తాము రచించిన సూత్రవ్యాఖ్యానం చివరిలో, సూత్రాలకు దాని ముందు పూర్వపక్షాన్ని నిరసించి, తిరిగి సిద్ధాంతాన్ని స్థిరపరిచినట్లుగా అర్థం చెప్పారు. ఈ విధంగా వ్యాఖ్యానం చేయడం శ్రీశంకర భాష్యానికి నేరుగా విరుద్ధం. ఉదాహరణకు స్థాలీపులాకన్యాయంలో కొన్నిటిని మాత్రం ఇక్కడ ప్రస్తావించాము. శ్రీ భాష్యం, శ్రుతప్రకాశిక అనే ఈ రెండు గ్రంథాలలో ఉండే రసాన్ని అనుభవరసికులు తెలియగలరు. బుద్ధిమంతుల రసనాడిని ఈ గ్రంథాలు స్పృశించి రసం బుద్ధిలో విచ్ఛేదం లేకుండా ప్రవహించేటట్లుగా చేస్తాయి– అని వేదాంతదేశికులు చెప్పిన మాట తాము అనుభవించి చెప్పిన మాట.

శ్రీ భాష్యానికి శ్రుతప్రకాశికయే కాకుండా, మేఘనాదసూరి అనేవారు రచించిన ప్రాచీనవ్యాఖ్యానం ఒకటి ఉన్నది. ఆ వ్యాఖ్యానం పూర్తిగా లభించకపోయినా, దానికి మాతృకలు ఉన్నాయి. మొదటి నాలుగు సూత్రాలైన నాలుగు అధికరణాలలో మొదటి అధికరణం మాత్రం శాస్త్రాన్ని సమర్థిస్తున్నట్లు, జన్మాద్యధికరణం నుండి శాస్త్రం ఆరంభం అయినదనేది భాష్యకారులకు తాత్పర్యమని ఆ వ్యాఖ్యానంలో సమర్థింపబడడానికి ఆక్షేపించి, శ్రుతప్రకాశికలో యుక్తులు అనుగ్రహింపబడ్డాయి. అధికరణ సారావళిలో ఆ పక్షం కొందరి పక్షమని చెప్పబడింది. శ్రుతప్రకాశికాచార్యులవారి ఆచార్యులైన నడాదూర్ అమ్మా ళ్ అనే శ్రీవాత్స్య వరదాచార్యులవారు తత్వసారం అనే ఒక చిన్న గ్రంథాన్ని అనుగ్రహించార. అందులో ఉండే శ్లోకాలు కొన్ని శ్రుతప్రకాశికలో ఉదాహరింపబడ్డాయి.

శ్రుతప్రకాశిక వ్యాఖ్యానం చాలా విస్తృతంగా ఉన్నదనే కారణంచేత అందులోని విషయాలను సంగ్రహించి, శ్రుతప్రదీపిక అనే ఒక వ్యాఖ్యానం కూడా శ్రీ సుదర్శన సూరిచే అనుగ్రహింపబడింది. అందులో కొంత భాగం విశాఖపట్నంలో ఉండే మహావిద్వాంసులైన పరవస్తు స్వామివారిచే అచ్చు వేయబడింది. శ్రుతప్రకాశికవంటి సంపూర్ణమైన వ్యాఖ్యానం

శ్రీభాష్యానికి ఏర్పడడం శ్రీవైష్ణవలోకం చేసిన గొప్ప పుణ్యఫలమే. సంస్కృతంలో ఉండే 36వేల గ్రంథం ఇది. దీని గొప్పతనాన్ని, ఇందులోని రసాన్ని అనుభవించడం కంటే భాగ్యం ఇంకొకటి లేదు. దీనిని సులభంగా అందరూ అనుభవించేటట్టుగా ద్రావిడభాషలో అనువదించి ప్రచారం చేసే మహోపకారం కంటే గొప్ప సహాయం వేరొకటి లేదు. ఇంతకంటే గొప్ప కైంకర్యం ఇంకొకటి లేదు. శ్రుత ప్రకాశికా వ్యాఖ్యానకర్తకు సుదర్శన భట్టర్ అని పేరు. వ్యాసార్యులు అనేది వీరికి శ్రీ రంగనాథుడు పెట్టిన తిరునామం అనేది ప్రసిద్ధం. "ఇక్కడ ఉన్నది మాత్రమే ఎక్కడైనా ఉంటుంది, ఇందులో లేనిది ఎక్కడ ఉండదు" అని గొప్పతనం చేత, భారవత్వంచేత మహాభారతం అనబడే మహాభారతగ్రంథంవంటి గొప్పతనాన్ని కలిగినది, ఈ గ్రంథం. ఇది అధ్యాత్మ శాస్త్రంలో ఒక మహాభారతం వంటిది. ఇందులో ఉండే వాదయుక్తులను మహాభారత యుద్ధంతో పోల్చవచ్చు. జయం ఎల్లప్పుడూ శ్రీరామానుజులైన శ్రీకృష్ణునికే. సుదర్శనునకే జయం. జయమని మహాభారతానికి పేరు. ఈ గ్రంథాన్ని మొదట వేదాంతాచార్యులవారు రక్షించి ప్రవర్తింప చేసిన విషయం సంప్రదాయ ప్రసిద్ధం, వారి అధికరణ సారావళి దీనికి, శ్రీభాష్యానికి సంగ్రహం. దీనికి భావప్రకాశిక అనే ఒక వ్యాఖ్యానం ఉపనిషద్భాష్యకారులు అనే ప్రసిద్ధి పొందిన రంగరామానుజ స్వామిచే రచింపబడింది. అది కూడా అచ్చు వేయబడింది.

ఈ శ్రుతప్రకాశిక గ్రంథంలోని గొప్పతనం తత్వమార్తాండం అనే గ్రంథాన్ని చూస్తే చక్కగా తెలుస్తుంది. మాధ్వ సంప్రదాయంలో చంద్రిక అనేది ఒక అరుదైన గ్రంథం. అందులో ఒక్కొక్క సూత్రానికి తమ సంప్రదాయంలో ఉండే అర్థమే సరి అని, మిగిలిన భాష్యకారులు చెప్పిన అర్థాలు స్వరసం కాదని చెప్పబడింది. ఒక్కొక్క అధికరణంలోను శీభాష్యాన్ని, శ్రుతప్రకాశికను అనువాదం చేసి, దాని పేరులో వాదకోటిని చెప్పారు. ఆ వాదకోటులకు సమాధానం చెప్పే స్వతంత్ర సిద్ధాంతార్థాలను సమర్థనం చేయడానికి ఆ గ్రంథం ఏర్పడింది. "త్రయీశిఖర పద్ధతిం పరదురుద్ధతే, రుద్ధరన్ అపార్థపరకధ్వనాన్యపి కదర్థయన్నర్థతః, సమస్తపదగామినా సముదగాయి యో వ్యాస ఇత్యహం జితకుదర్శనం హృది సుదర్శనం భావయే" అనేది వ్యాసార్య విషయంగా ఈ గ్రంథంలోని మంగళశ్లోకం. ప్రపంచం అంతటికి నామరూప వ్యాకరణ చేసిన శ్రీ రంగనాథునిచే వీరికి వ్యాసులనే ఒక అపూర్వమైన తిరునామం పెట్టబడింది– అని అక్కడ చెప్పారు. చంద్రికలోని వాదకోటులను అనువాదం చేసి, వానికి సమాధానం శ్రుతప్రకాశికలోని అక్షరాలతోనే లభిస్తున్నదిగా చాలా అందంగా అక్కడ నిరూపించారు. శ్రుతప్రకాశికను అక్షరక్షరంగా ఆ స్వామి అనుభవించి, ఆనందించి మనసులో పెట్టుకున్నవారు, వీరు– అని వారి గ్రంథాల చేత తెలుస్తున్నది. "

అత్రేమాని సౌదర్శనాన్యక్షరాణి" అని అంటూ అక్కడ ఉదాహరించారు. ఇప్పుడు కూడా శ్రీభాష్యానికి, శ్రుతప్రకాశికను మించి వాదకోట్లను చెబుతున్నట్లుగా ఏ గ్రంథం రచింపబడినా, ఆ గ్రంథంలోని వాదాలకు శ్రుత ప్రకాశికను అనుసరించి సులభంగా సమాధానాన్ని చెప్పవచ్చు.

ఉపనిషత్తులకు మిగిలిన భాష్యకారులు భాష్యం రచించినట్లుగా శ్రీ భాష్యకారులు భాష్యాన్ని అనుగ్రహించకపోయినా, ఆ యా అధికరణాలలోని విషయవాక్యాలైన ఖండాలకు విస్తృతంగా భావాలను వారు అనుగ్రహించారు. అంతరధికరణంలోను, ఆనుమానికాధికరణంలోను కఠవల్లి వ్యాఖ్యానింపబడింది. దహరాధికరణంలో దహరప్రజాపతి వాక్యాలు వివరింపబడ్డాయి. వేదార్థసంగ్రహలోను, జిజ్ఞాసాధికరణంలోను సద్విద్యాదులు వ్యాఖ్యానింపబడ్డాయి. శ్రుతప్రకాశికలో ఉపనిషత్తులలో ఉండే ముఖ్యమైన వాక్యాలు మొత్తం వ్యాఖ్యానం చేయబడ్డాయి. శ్రుత ప్రకాశికా వాక్యాలు అక్కడక్కడ విస్తృతంగా ఉపనిషద్భాష్యంలో ప్రస్తావింపబడ్డాయి. ఆరాయిరప్పడి వ్యాఖ్యానమైన ఇరుపత్తునాలాయిరప్పడిలో శ్రుతప్రకాశికలో అనుగ్రహింపబడిన అంశాలను అక్కడక్కడ ఉదాహరించారు. ఉపనిషత్తుల వాక్యాలకు మన పక్షంలోను, ఇతరులు పక్షంలోనూ ఉండే స్వారస్యాలను లెక్కించి, త్రాసులో పెట్టి నిలిపి, ఈ గ్రంథంలో నిర్ణయం చేయబడింది. ఈ గ్రంథాలలో ఉండే అరుదైన విషయాల గొప్పతనాన్ని ఇక్కడ వివరించడానికి అవకాశం లేనందున వేరొక సమయంలో వివరిస్తాను. సగుణ నిర్గుణ వాక్యాలకు శ్రీరామానుజులు అనుగ్రహించిన రీతిలోనే విషయ వ్యవస్థనుబట్టి వ్యాఖ్యానం చేయడం ఉచితమనేదానికి ఒకే చిన్న వాక్యంతో 15 అభేద్యాలైన యుక్తులను శ్రుతప్రకాశికాచార్యులవారు సంగ్రహించారు. ప్రధాన ప్రతితంత్రార్థం అయిన శరీరశరీరి భావాన్ని విస్తృతంగా ఉపవాదించే సుబాలోపనిషత్తుకు తామే వ్యాఖ్యానం అనుగ్రహించారు. వీరు వ్యాసులనే నామం పెట్టబడినదానికి తగినట్లు శ్రీభాగవతానికి శుకపక్షీయం అనే ఒక అందమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించగా, అది బృందావనంలో ముద్రింపబడింది. దానిని అనుసరించే వీరరాఘవీయం అనే వ్యాఖ్యానం రచింపబడింది– అని ఆ వ్యాఖ్యాతయే చెప్పారు. వీరి గొప్పతనం, జ్ఞానం ఇంతటిది– అని చెప్పడానికి సాధ్యం కాకపోయినప్పటికీ, వీరు తమ ఆచార్యులైన అమ్మాళ్ వద్ద తాము ఆలకించిన అర్థాలనే తాము వ్యక్తం చేస్తున్నట్టుగా గ్రంథానికి పేరును పెట్టారు. అందువల్ల వీరి ఆత్మగుణాలు ప్రకాశిస్తున్నాయి. వేదాంతాచార్యులవారు కూడా దీనిని అనుసరించి "తస్మాదస్మచ్ఛ్రుతాబ్ధే రమృత మివ సముద్వాంతమ్" అని అనుగ్రహించారు.

ఈ కాలంలో వివేక జ్ఞానాన్ని కలిగిన అందరూ అజ్ఞానం, సందేహం తీరేటట్లుగా విషయాలను విచారించి, " సారతమం అయిన దర్శనం ఇది" అని తెలిసికోవాలని చాలా ఆశపడుతున్నారు. అది న్యాయమే. కేవలం మూఢశ్రద్ధతో, విశ్వాసంతో మాత్రం ఏ దర్శనం చిరకాలం నిలువ లేదు. ఇప్పుడు ద్రావిడీకరింపబడి ప్రచురింపబడుతున్న ఈ రెండు గ్రంథాలను చక్కగా తెలిసి కొన్నట్లయితే, మన దర్శనానికి చెందినవారు చలించరు. జ్ఞానంతో మాత్రం మోక్షం లభిస్తుంది– అనేది ప్రసిద్ధం "సా విద్యా యా విముక్తయే" అని మోక్షాన్ని పొందించే విద్య మాత్రమే విద్య. మానవులందరూ జ్ఞానంతో మోక్షాన్ని పొందాలని కోరుకుంటారు. సారాసారవివేకం కలిగిన వారందరూ ఈ అధ్యాత్మ విద్యను అధికరించడంలో అధికారులే. శ్రీ భాష్యం రెండవ శ్లోకంలోని "సుమనసో భౌమాః పిబంతు అన్వహమ్" అనే సూక్తిలో " "సుమనసః " అనేదానికి "సారాసారవివేచనం కలిగినవారిచే ఈ గ్రంథం అధికరించదగినది"– అని శ్రుతప్రకాశికాచార్యులవారు అనుగ్రహించారు.

"ఆద్య స్య నః కులపతేః" అనే విధంగా ప్రసన్నజనకూటస్థులైన ఆళ్వారులకు ఈశ్వరుడు తన స్వరూపరూప గుణ విభూతుల జ్ఞానాన్ని అనుగ్రహించగా, ఆ జ్ఞానం భక్తిరూపమైన జ్ఞానం కనుక, తదనుభవజని ప్రీతి లోపల ఇముడనందున, బయటకు ద్రవిడోపనిషత్తు రూపంగా వెలువడింది. శ్రీమన్నాథమునులు ఆళ్వార్ల అనుగ్రహం చేత దానిని పొందారు. తరువాత ఆచార్యోపదేశక్రమంలో శ్రీ ఆళవందార్ ద్రవిడోపనిషత్ ప్రసిద్ధమైన తత్త్వహితపురుషార్థాలను పొంది, వానిని తాము అనుసంధించి, సంసారులు దుర్గతిని చూచి, వారు దీనిని కోల్పోకూడదు–అని పరమ కృపతో సకలోపనిషద్రహస్యంగాను దుర్ జ్ఞేయంగాను ఉండే అర్థాలను సర్వాధికారం అయ్యేటట్లు స్తోత్రరూపంలో అనుగ్రహించారు– అని స్తోత్రరత్న వ్యాఖ్యానం అవతారికలో పెరియవాచ్చాన్ పిళ్లై అనుగ్రహించారు. ఇక్కడ ప్రతిపాదింపబడేది, ఆళ్వారులు తాము పొందినది, దాని మూలంగా శ్రీమన్నాథమునులు మొదలుగా ఉండే పూర్వాచార్యుల మూలంగా వచ్చి, " లోకే ౨ వతీర్ణ పరమార్థ సమగ్రభక్తి " అనే విధంగా భగవద్భక్తికి మిట్ట అయిన ఈ సంసారంలో పరమపదంలో అనుభవించదగిన సాధ్యభక్తి. " నాన్ముగనార్ పెఱ్ఱనాట్టుళే నల్వాలుక్కు ఉయ్ త్తనన్" (ఈ బ్రహ్మ సృష్టించిన లోకంలోనివారిని పరమపదాన్ని పొందించారు) అనే ఆళ్వారుల సూక్తి ప్రకారం అది సర్వాధికారం అయినది. దీనికి తగినట్లుగా తత్త్వత్రయ వ్యాఖ్యానావతారికలో శ్రీమణవాళ మహామునులు కూడా "శాస్త్రాభ్యాసానికి అధికారరం లేనివారైన స్త్రీశూద్రాదులకు ముముక్షుత్వం ఉన్నప్పటికీ, అది నిష్ప్రయోజనం అయ్యేటట్లుగా

ఉన్నందున, అది ఉపదేశగమ్యం అయేటప్పుడు ఉక్తదోషం ఏమి లేదు “ అని అనుగ్రహించారు.

పంచసంస్కార సంపన్నులై, ముముక్షువులైన చేతనులు భగవద్విషయంలోను, మిగిలిన దివ్యప్రబంధాల వ్యాఖ్యానాలలోను నిక్షిప్తం చేయబడిన రహస్యార్థాలను, శ్రీరామానుజులు ప్రసాదించిన శ్రీ భాష్యాన్ని, భగవద్గీతా భాష్యాన్ని, పూర్వాచార్యులు అనుగ్రహించిన రహస్యత్రయ, తత్వత్రయ, తత్వశేఖర తత్వ దీపాది రహస్య గ్రంథాలను, స్తోత్రరత్న గద్యత్రయ పంచస్తవ శ్రీరంగ రాజస్తవాది స్తోత్రపాఠాలను, సంశయ విపర్యయాలు లేకుండా తెలియడంలోను, వాటిలోను, వాటి వ్యాఖ్యానాలలోనూ ఉదాహరింపబడిన శ్రుతుల అర్థాలను తెలుసుకోవడం అవశ్యం అపేక్షితం. పైన ప్రస్తావించిన వ్యాఖ్యానాలలో ఉదాహరింపబడిన శ్రుతుల వాక్యాలను ఉదాహరించి తెలిసికొనేటప్పుడు అపశూద్రాధికరణ న్యాయం ప్రసంగిస్తుంది– అనేది ఆజ్యావేక్షణన్యాయంతో పరిహృతమైనది. శ్రీభాష్యాన్ని అధికరించడానికి భాష్యకారులచే చెప్పబడిన అర్థిత్వసామర్థ్య నియమాలు “ “ఉభయ పరికర్మితస్వాంతస్య” అనే విధంగా అధికృతాధికారమైన సాధనభక్తిని ఆశ్రయించినదే తప్ప, సాధ్యభక్తి విషయం కాదు. ముముక్షువై, ప్రపన్నుడైన చేతనునకు ఉపదేశ గమ్యమై వచ్చేటట్లు అయితే, శ్రీ భాష్యకారుల అపశూద్రాధికరణలో సాధనభక్తి అధికారికి అపేక్షితం –అని చెప్పిన సామర్థ్యం ఈ అధికారికి కూడా రావడంలో అడ్డు లేదు. “సుమనసః” అనే శబ్దానికి అర్థంగా గ్రహించిన సారాసార వివేచనం ఈ అధికారికి కూడా ఉన్నది. శ్రీ రామానుజుల తిరువడి సంబంధాన్ని కలిగిన అందరూ శ్రీభాష్యాన్ని, శ్రుతప్రకాశికను చక్కగా తెలుసుకొని, అనుభవంలోకి తెచ్చుకోవాలి.

“పొలిగ పొలిగ పొలిగ” అని శ్రీ వైష్ణవదర్శనానికి, శ్రీ భాష్యానికి, శ్రుతప్రకాశికకు సమృద్ధి కలగాలని ఆశాసనం చేయడమే ఇపుడు మనం చేయవలసిన కర్తవ్యం.

రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతామ్ అభివర్ధతామ్.



# 2. శ్రీభాష్య వైభవమ్–2

శ్రియఃపతి అయిన, పరమకారుణికుడైన, షాడ్గుణ్య పరిపూర్ణుడైన శ్రీమన్నారాయణుడు త్యాజ్యోపాదేయాలకు తగిన ఇష్టానిష్టాలను, వాటి సాధనాలను చక్కగా వివేకించి తెలుసుకోవడం కోసం వేదాంతమనే ప్రమాణదీపాన్ని వివేకాన్ని కలిగిన ప్రాణివర్గానికి అనుగ్రహించి, అవతారం మొదలైనవాటిద్వారా దాని జ్ఞానప్రభ లోకంలో అంతటా. వ్యాపించేటట్లు చేశాడు. అటువంటి విలక్షణమైన జ్ఞానప్రభ లోకంలో కృతయుగంలో యథాతథంగా నిలచి ఉన్నది. త్రేతాయుగంలో కొంచెం మార్పు చెందింది. ద్వాపరయుగంలో మరింత చెదరిపోయింది. అందువల్ల తత్వజ్ఞానాన్ని కోల్పోయి. పరావరతత్వ విషయంలో మార్పు చెందిన మనస్సు కలిగినవారైన బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవతలు శ్రీమన్నారాయణని శరణు పొంది, పూర్తిగా నశించిపోయిన జ్ఞానాన్ని లోకంలో ప్రకాశింపచేయాలని ప్రార్థించగా, ఆ విధంగానే వారి కోరికకు అంగీకరించి, లోకం తరించేటట్లుగా శ్రీమన్నారాయణుడు స్వయంగా పరాశరమహర్షిద్వారా సత్యవతీదేవి పుత్రునిగా అవతరించాడు. నదీమధ్యంలో ఆవిర్భవించినందున ద్వైపాయనుడు అని, బ్రహ్మజ్ఞాన దీపప్రభద్వారా జీవకోటి అజ్ఞానాంధకారాన్ని తొలగించి, మళ్లీ ఆ అంధకారం వారిని దరి చేరకుండా ఉండేటట్లు దానిని తొలగించే సామర్థ్యాన్ని కలిగి ఉండడాన్నిబట్టి, తల్లిదండ్రులు ప్రత్యక్ దృష్టితో కృష్ణుడని పేరు పెట్టి పిలిచారు. వివేకించి తెలిసికోలేని విధంగా, ఒకటిగా కలిసి ఒకే సమూహంగా ఉండే వేదాలను ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదాలనే విధంగా నాలుగు విధాలుగా విభాగం చేసి, ఆ విధంగా విభాగించిన ఆ వేదానలలో, క్రమంగా, ఋగ్వేదాన్ని 21 ప్రకారాలు కలిగినదిగా, యజుర్వేదాన్ని 101 ప్రకారాలు కలిగినదిగా, సామవేదాన్ని వేయి ప్రకారాలు కలిగినదిగా, అధర్వణ వేదాన్ని 9 ప్రకారాలు కలిగినదిగా విభాగించి, వాటిని అధ్యయనం చేయడానికి తగిన క్రమాలను ఉపదేశించి, లోకంలో శిష్యుల ముఖంగా వ్యాపింప చేసినందున వ్యాసులు అనే తిరునామాన్ని ఇతడు పొందాడు. ఇటువంటి మహిమ పొందినవాడుగా ఉన్నందున సాక్షాత్తు వేదపురుషుడే " స హోవాచ వ్యాసః పారాశర్యః" అని ఈ మహర్షిని కీర్తించాడు. పరమ కృపానిది అయిన శ్రీ వేదవ్యాసమహర్షి ఆ వేదంలోని పూర్వభాగానికి తన శిష్యుడైన జైమిని మహర్షిని పురస్కరించుకొని 12 అధ్యాయాలను కలిగిన పూర్వ మీమాంసా సూత్రాలను, కాశకృత్స్న మహర్షిని పురస్కరించుకొని నాలుగు అధ్యాయాలను కల దేవతాకాండ ప్రతిపాదకమైన సూత్రాలను రచింపజేసి, బ్రహ్మ స్వరూప ప్రతిపాదకమైన ఉత్తర భాగాన్ని చక్కగా రచించి, లోకంలో ప్రకాశింపజేయాలని తలచి, తానే నాలుగు అధ్యాయాలను కల

545 బ్రహ్మసూత్రాలను రచించారు. సంగ్రహమైన అక్షరాలను, విస్తృతమైన అర్థాన్ని కలిగి ఉండడంతో పాటు, సారవంతంగానూ, సర్వతోముఖంగాను, అనర్థక శబ్దాలు లేకుండానూ, నిర్దోషంగానూ ఉన్నందున ఈ బ్రహ్మసూత్రాలు ఒకటే సూత్రలక్షణానికి తగిన లక్ష్యమైనవి. యోగదశలో మంత్రాలు సాక్షాత్తుగా తరిసించగలిగినవారే ఋషులు అని చెప్పబడతారు ఆ విధంగా ఆచార్యుల ఉపదేశం లేకుండా, తన యోగమహిమచేత మంత్రాలను సాక్షాత్కరించుకున్న వ్యాసమహర్షిచే రచింపబడిన సూత్రాలలోని భావాన్ని, వారివలె ఉండే మహర్షియే తెలియగలడు. ఎందుకంటే, సర్వజ్ఞులైన ఋషుల అభిప్రాయాన్ని ప్రత్యక్ దృష్టి లేని సామాన్యమైన మానవులు తెలుసుకోగలిగే సామర్థ్యాన్ని కలవారు కారు. ఆర్షవచనాలు భ్రమ, విప్రలంభ, ప్రమాదాలను లేనివిగాను, సత్యార్థ ప్రతిపాదకాలుగాను ఉన్నందున, వేదోపబృంహణాలుగా అంగీకరించబడి ఉన్నవి. అందుచేత, అటువంటి మహర్షి కులధురంధరులైన వేదవ్యాసునిచే అనుగ్రహింపబడిన బ్రహ్మసూత్రాలలోని అర్థాన్ని యథాతథంగా ఆర్షదృష్టితో తెలిసికొనిన బోధాయన మహర్షి చేత వివరంగా వివరింపబడిన వృత్తి గ్రంథాన్ని మూలంగా గ్రహించి, అవతరించిన భగవద్రామానుజుల శ్రీ భాష్యమే ఈ లోకంలో సంసారసముద్రంలో పడి, తీరాన్ని చూడలేక మునిగి తపించే ప్రాణులకు మోక్షాన్ని పొందడంలో అత్యంతావశ్యకమైన సాధనంగా ప్రకాశిస్తున్నది. సూత్రాలను అనుసరించి ఉండే పదాలతో ఎక్కడ సూత్రార్థం వివరింపబడుతుందో, మొదట సంగ్రహంగా చెప్పబడిన తన మాటలకే ఎక్కడ వివరించి అర్థం స్పష్టంగా చెప్పబడుతుందో, దానిని విజ్ఞులు భాష్యం అని అంటున్నారు. ఈ విధంగా చెప్పబడిన లక్షణానికి తగినట్లుగా ఉండే ఈ శీభాష్యాన్ని అనుగ్రహించినవారు– భగవద్రామానుజ మునిసార్వభౌములు.

బ్రహ్మస్వరూపాన్ని నిరంతరంగా, అన్ని కాలాలలోనూ మననం చేసి, అజ్ఞానాంధకారాన్ని జ్ఞానదీపప్రకాశంతో పోగొట్టుకొని పరమాత్మ సాక్షాత్కారాన్ని పొంది, తాము నేరుగా దర్శించిన రీతిలో యథాతథంగా బ్రహ్మస్వరూపం, దాని గుణవిభూతులు ఇందులో విస్తృతంగా ప్రతిపాదింపబడుతున్నందున, దీనిని ఉపనిషత్తు అనే అభియుక్తులు చెబుతున్నారు. అంతేకాక, ఈ శ్రీభాష్యగ్రంథాన్ని తిరుక్కచ్చినంబి మూలంగా కంచి నగరాన్ని తన నివాసంగా కలిగి ఉండే వరదరాజస్వామి చేసిన ఆజ్ఞానుసారం, ఆ భగవంతుడు అనుగ్రహించిన అర్థాలను ఆ విధంగానే కూర్చి రచించినందున, అల్పజ్ఞానాన్ని కలిగినవారైన అన్యమానవులచే రచింపబడిన మిగిలిన ఆభాసభాష్యాలకంటే వేయి రెట్లు శ్రీ రామానుజుల శ్రీ భాష్యం కీర్తించదగినదిగా ఉన్నది. ఉపనిషత్తులలో చెప్పబడిన పరమపురుష స్వరూపిగా ఉండే శ్రీవరదరాజ స్వామి తిరుక్కచ్చినంబి ద్వారా శ్రీ రామానుజులకు ఉపదేశించిన

రహస్యర్థాలు 6. అవి ఏవి?అంటే, "నేనే పరతత్వాన్ని, ప్రపత్తి మోక్షమార్గం, అంతిమ సమయంలో నా స్మరణం కలిగి ఉండాలనే నియమం లేదు, ఈ శరీరం చివరిలో మోక్షం లభిస్తుంది, నా మతం విశిష్టాద్వైతం, పెరియనంబిని శ్రీరామానుజులు ఆశ్రయించాలి"– అనేవి ఈ ఆరు అర్థాలు. లోకంలో ఆర్ష గ్రంథాలు లెక్క లేకుండా ఉన్నప్పటికీ, శ్రీ వాల్మీకి మహర్షి రామాయణం ఒకటే ప్రతిపాద్యనాయకుడైన శ్రీరామునిచే నేరుగా విని, అభినందింపబడినందున, ఆ విధంగా అసాధారణమైన గొప్పతనాన్ని కలిగి ప్రకాశిస్తున్నదో, ఆ విధంగానే, ఈ శ్రీభాష్యంకూడా ఉపనిషత్తులలోని అర్థవివరణ రూపంగా ఉండే ఈ గ్రంథంచేత ప్రతిపాదింపబడుతున్న పరమ పురుషునిచే నేరుగా సాక్షాత్తుగా తన అభిప్రాయాన్ని తిరుక్కచ్చినంబి ద్వారా వ్యక్తం చేసి, ఈ రామానుజ మునులను పురస్కరించుకుని రచింపజేసినందున, దీనిని చూసినప్పుడు, పరిమిత జ్ఞానాన్ని కలిగిన, భ్రమ, ప్రమాదం, ఆశక్తి, విప్రలంభం మొదలైన దోషాలతో దూషింపబడిన మనసుతో, ఆగ్రహంతో వేదార్థాలను బాగా గమనించకుండా, ముందు వెనుకలలో తమ వచనాలలో ఏర్పడే దోషాలను గమనించకుండా, చెడ్డ అర్థాలతో నిండిన, ప్రమాణహీన వచన జాలాలతో నిండి ఉండేటట్లుగా రచింపబడిన మిగిలిన అపసిద్ధాంత గ్రంథాలను అన్నిటినీ ఒక పర్వతశిఖరంపై ఉండేవాడు భూమిలో ఉండేవారిని అల్పంగా చూసినట్లే, అల్పంగా చూచి, అపహాస్యం చేస్తారు. ఈ శ్రీభాష్య గ్రంథం అనేది విషయవైలక్షణ్యాన్ని కలిగి ఉన్నట్లే, వక్తృవైలక్షణ్యాన్ని కూడా కలిగి ప్రకాశిస్తున్నది.

ఈ గ్రంథనిర్మాత అయిన శ్రీ భగవద్రామానుజముని శ్రీపెరంబూదూరులో ఆసూరి కులానికి చెందిన కేశవసోమయాజికి కలియుగంలో పింగళ నామ సంవత్సరం చైత్రమాసం ఆర్ద్రా నక్షత్రంలో అద్వితీయ పుత్రునిగా అవతరించారు. శ్రీ భాష్యంద్వారా సమీచీనాలైన అర్థాలను తెలియజేయడం కోసం, తనకు రాత్రి పగలు అని తేడా లేకుండా ఎల్లప్పుడూ తన శేషవృత్తిలో ఆసక్తులై ఉండే ఆదిశేషుని భగవంతుడు నేరుగా నియమించి, ఈ భగవద్రామానుజులుగా అవతరింపజేసినందున, వీరు దైవీస్వభావం కలిగినవారని లోకంలో ఉండే అందరూ వీరిని పూజిస్తున్నారు. ఈ మహానుభావులు జన్మించగానే, శ్రీపెరియ తిరుమల నంబి శ్రీపెరంబూదూరుకు వచ్చి, శిశువును చల్లగా కటాక్షించి, " లక్ష్మణో లక్ష్మి సంపన్నః "అనే విధంగా దివ్యలక్ష్మీసంపన్నుడైన ఉన్నందున, ఇళైయ పెరుమాళ్ అనబడే లక్ష్మణ స్వామి పేరు తగినది– అని శ్రీ రామానుజులు అనే తిరునామాన్ని పెట్టారు. సత్సంప్రదాయాన్ని లోకంలో నిలిపి, అపసిద్ధాంతాలను నిరసించి, అజ్ఞులుగా ఉండే లోకులను రక్షించడానికి వచ్చిన స్వామి కనుక, ఈ దివ్య వ్యక్తిని ఉడైయవర్ అని

వ్యవహరిస్తారు. ఈ పేరును శ్రీరంగనాథుడు అర్చాముఖంగా వీరికి అనుగ్రహించాడు. జ్ఞానాదులతో, అమానుషాలైన శక్తి విశేషాలతో, అనితర సాధారణ జగద్రక్షణ సామర్థ్యంతో భగవంతునితో ఐక్యభావనచేత ఈ మహాపురుషుని ఎంబెరుమానార్ అని కూడా పిలుస్తారు. వీరు బాల్యంలో యాదవ ప్రకాశుల దగ్గర పూర్వపక్షశాస్త్రాలను సవిస్తరంగా అధ్యయనం చేశారు. జ్ఞానవృద్ధులు అయినందున చాలా బాల్యంలోనే వైరాగ్యంతో లౌకిక సంబంధాలను విడిచిపెట్టి, సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. తరువాత వీరి జ్ఞాన వైరాగ్యాదుల చేత, అనుష్ఠానం చేత, బ్రహ్మజ్ఞానం చేత వీరి విషయంలో అభినివేశాన్ని పొంది, వీరికి ఉపాధ్యాయులై ఉండే ఆ యాదవప్రకాశులే వీరిని ఆచార్యులుగా ఆశ్రయించి, త్రిదండి సన్యాసాన్ని పరిగ్రహించి, గోవిందజీయర్ అని వీరిచే పిలువబడి, వీరికి శిష్యులయ్యారు. వీరు 9, 000 మంది సన్యాసులతో, 12, 000 మంది పరమైకాంతులతో అంతటా సంచరించి, దుర్వాదులను, కుదృష్టులను వాదంలో జయించి, ఆయా ప్రదేశాలలో విశిష్టాద్వైతాన్ని స్థాపించారు. కాశ్మీర దేశంలోని సరస్వతీ పీఠాన్ని వీరు చేరగా, సరస్వతీదేవి వీరికి స్వాగతం చెప్పి పిలచి, వీరు రచించిన శ్రీ భాష్యాన్ని విని సంతోషించి, " మీరు రచించిన ఈ బ్రహ్మసూత్ర భాష్యం శ్రీ భాష్యం అని లోకంలో ప్రసిద్ధి పొందగలదు. ఈ మహనీయ గ్రంథాన్ని రచించిన మీకు శ్రీ భాష్యకారులు అనే పేరును మీకు నేను బహూకరిస్తున్నాను " అని పలికి, ఆ శ్రీభాష్యాన్ని శిరసా వహించి, తనకు ఆరాధ్యదైవమైన లక్ష్మీ హయగ్రీవుల అర్చామూర్తిని, శ్రీ భాష్యాన్ని శ్రీరామానుజుల చేతిలో పెట్టింది. శ్రీరామానుజులు కూడా ఆ మహాధనాలను పొంది, చాలా ఆనందించి, తిరిగి అనేక దేశాలలో నిరంకుశంగా సంచారం చేసి, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని వ్యాపింప చేశారు. శ్రీవైష్ణవ సిద్ధాంత ధ్వజాన్ని లోకంలో సుస్థాపించారు. తత్త్వార్థ ప్రతిపాదకమైన శిభాష్య గ్రంథంతో శ్రీరామానుజులు అజ్ఞానాంధకారంతో నిండిన ఈ లోకంలో తల్లడిల్లుతున్నవారికి స్వరూపోపాయ పురుషార్థాలను ఉపదేశించి, వర్ణాశ్రమ ధర్మాలు లోపించకుండా సక్రమంగా అనుష్ఠించేవారికే పరమపురుషార్థ సిద్ధి కలుగుతుంది– అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేశారు. వీరు రచించిన గ్రంథాలు 9. అవి శ్రీ భాష్యం, వేదాంతసారం, వేదాంత దీపం, వేదార్థ సంగ్రహం, శ్రీరంగ గద్యం, శరణాగతి గద్యం, శ్రీవైకుంఠ గద్యం, నిత్యం, గీతా భాష్యం– అనేవి.

విషయం సంశయం, విచారం, నిర్ణయం, ప్రయోజనం– అనే ఈ ఐదు విషయాలను కలిగినది అధికరణం అని చెప్పబడుతున్నది అటువంటి లక్షణాన్ని కలిగిన అధికరణాలు ఈ శ్రీ భాష్య గ్రంథంలో 156 ఉన్నాయి. 9వేల గ్రంథ పరిమితిని కలిగినది, ఈ

శ్రీ భాష్యం –అని అభియుక్తులచే నిర్ణయింపబడినది. దీనికి మూలంగా ఉండే బ్రహ్మసూత్రం 4 అధ్యాయాలను కలిగినది. ఒక్కొక్క అధ్యాయం నాలుగు పాదాలతో కూడినది. మొదటి అధ్యాయం సమన్వయాధ్యాయం రెండవ అధ్యాయం అవిరోధాధ్యాయం, మూడవ అధ్యాయం సాధనాధ్యాయం, నాల్గవ అధ్యాయం ఫలాధ్యాయం అని చెప్పబడుతున్నవి. మొదటి అధ్యాయాలు రెండు విషయద్వికం అని, తరువాతి అధ్యాయాలు రెండు విషయిద్వికం అని వేదాంతులు వ్యవహరిస్తారు. నాలుగు అధ్యాయాలను కలిగిన ఈ బ్రహ్మసూత్రాలలో 16 పాదాలు ఉన్నాయి. మొదటిది అయోగవ్యవచ్ఛేద పాదమని, రెండవ, మూడవ, నాలుగవ పాదాలు అన్య యోగవ్యవచ్ఛేదపాదాలని, ఐదవ పాదం స్మృతి పాదం అని, ఆరవ పాదం తర్కపాదమని, ఏడవది వియత్పాదమని, ఎనిమిదవది ప్రాణపాదమని, తొమ్మిదవది వైరాగ్యపాదమని, పదవ పాదం ఉభయ లింగ పాదం అని, పదకొండవ పాదం గుణోపసంహార పాదమని, 12 వ పాదం అంగ పాదం అని, 13వ పాదం ఆవృత్తిపాదం అని, 14వ పాదం ఉత్క్రాంతి పాదమని, 15వ పాదం గతిపాదమని, 16వ ముక్తిపాదమని పిలువబడుతున్నాయి.

ఉపనిషత్తులు అని చెప్పబడే వేదాంతభాగాలకు విశిష్టాద్వైత సిద్ధాంతంలోనే ముఖ్యమైన అభిప్రాయం– అనే పరమ తత్వార్థాన్ని ఈ శ్రీభాష్యం సుస్పష్టంగా నిరూపిస్తున్నది అద్వైతం అనే మతానికి ఐక్యం అని అర్థం. దీని వ్యుత్పత్తి ఒక విధంగా గ్రహించదగినది. , "ద్వయోః భావః ద్వితా, ద్వితైవ ద్వైతం, న ద్వైతం అద్వైతమ్. "– ఒకటిగా ఉండడం– అని దీని అర్థం. "– విశిష్టస్య అద్వైతం –విశిష్టాద్వైతమ్". చిత్తులను అచిత్తులను విశేషణంగా కలిగిన బ్రహ్మం అనేది ఒకటే– అని అర్థం. ఇందువల్ల "బ్రహ్మం ఒకటే సత్యంగా ఉన్నది, వస్తువు ఇంకొకటి ఏదీ యథార్థమైన వస్తువు, సత్యమైన వస్తువు కాదు. మిగిలినది అంతా మిథ్య"– అని చెప్పే మాయావాదుల మతవాదం అంతా శ్రుతివిరుద్ధం– అని చూపబడింది. ఈ విశిష్టాద్వైత సిద్ధాంతవాదం అన్ని శ్రుతుల యథార్థమైన అభిప్రాయాన్ని అంతర్భవించుకున్నది. అన్ని శ్రుతులకు సామంజస్యం ఈ సిద్ధాంతంలోనే గూడు కట్టుకొని ఉన్నది. ఈ విశిష్టాద్వైత మతం అనేది శ్రుతిబలంతో బ్రహ్మకే ఉపాదాన కారణత్వాన్ని, నిమిత్తకారణత్వాన్ని సాధిస్తున్నది. అందుచేత విశిష్టాద్వైతవాదులు అభిన్న నిమిత్తోపాదాన వాదులు– అని లోకంలో వ్యవహరింపబడుతున్నారు. సూక్ష్మ చిదచిద్విశిష్ట బ్రహ్మమే కారణం, స్థూలచిదచిద్విశిష్టమైన ఆ బ్రహ్మమే కార్యమై ఉన్నది. ఈ సిద్ధాంతంలో బ్రహ్మం పరిణామికారణం. విశిష్టాద్వైతసిద్ధాంతులవలె, మాయావాదులు కూడా బ్రహ్మకు ఉపాదాన కారణత్వాన్ని, నిమిత్త కారణత్వాన్ని సాధిస్తున్నారు. అయితే, వారు వివర్తోపాదానత్వాన్నే

బ్రహ్మకు సాధిస్తున్నారు. బ్రహ్మమే సత్యం, జగత్తు మిథ్య, అరణ్యంలోను ప్రజ్జువులోనూ క్రమంగా నీరు, సర్పం అనే బ్రాంతులు కలిగేటట్లే, బ్రహ్మస్వరూపాన్ని మరుగుపరచే స్వభావాన్ని కలిగిన అవిద్యచేత స్వయంప్రకాశ వస్తువు అయిన బ్రహ్మమే ఆవరింపబడి, దాని దానిలో పలు విధాలైన ప్రాపంచిక వస్తువులు తోస్తున్నాయి. నిజానికి బ్రహ్మం తప్ప, మిగిలినది ఏదీ లేదు. బ్రహ్మ చైతన్యం ఒకటే అవిద్య చేత ఆవరింపబడి, నానావిధ చేతనా చేతనవర్గాలుగా భాసిస్తున్నది. ఇన్ని భ్రమలకు అధిష్టానం బ్రహ్మమే. "అహం బ్రహ్మోస్మి "అనే మహా వాక్యార్థజ్ఞానంతో ఇంతకుముందు చెప్పబడిన అవిద్య తొలగి, తన కంఠంలో ఉండే మణిని తానే తెలుసుకున్నట్లుగా, తన స్వరూపాన్ని "నేనే బ్రహ్మంగా ఉన్నాను" అని తాను తెలుసుకోవడమే మోక్షం– అని అద్వైతులు చెబుతున్నారు. ఈ అద్వైత సిద్ధాంతంలో మృషావాదులు అభేద శ్రుతులను కాదని, మిగిలిన అన్ని శ్రుతులకు తిలజలతర్పణాన్ని విడిచి పెట్టారు. వీరికి మించినవారైన బౌద్ధులు అన్ని శ్రుతులకు జలతర్పణం చేశారు.

ఇక, విశిష్టాద్వైత సిద్ధాంతం అయితే, అన్ని శ్రుతులకు స్వాగతాన్ని పలికి, వాటి రాకను స్వాగతించి, వాటిని ప్రధానంగా చేసి వాటికి విధేయంగా తానుండి సేవ చేస్తున్నది. భేదశ్రుతులు, అభేద శ్రుతులు, సగుణ శ్రుతులు, నిర్గుణ శ్రుతులు– అనే అన్నిటికి ఈ మతంలోనే సామంజస్యం సంభవిస్తున్నది. వేదపురుషుని యథార్థమైన అభిప్రాయానికి ఇదే అనుకూలమైన మతమై ఉన్నది. వేదశ్రుతులు చెప్పినట్లుగా, ఈ మతంలో బ్రహ్మం, పలు పలు చిదచిద్వస్తువులు నిరూపింపబడుతున్నవి. అభేద శ్రుతులకు, భేదశ్రుతులకు ఏ బాధ లేకుండా ఉండేటట్లుగా విశిష్ట వస్త్వైక్యంలో అభిప్రాయం చెప్పబడింది. సగుణశ్రుతులకు ఈ సిద్ధాంతంలో సాటి లేని కిరీటం అలంకరింపబడింది. ఆ విధంగానే, నిర్గుణశ్రుతులకు, సగుణశ్రుతులకు ఏ విరోధం లేకుండా, హేయగుణాల రాహిత్యాన్ని తెలియజేయడంలో దృష్టి అని చెప్పబడింది. అందుచేత, సర్వశ్రుతిమనోహరమైన ఈ సిద్ధాంతం, ఈ భూలోకంలో కల్పవృక్షంవలె, కోరిన ఫలాలను ఇవ్వడంలో బద్ధకంకణంగా ప్రకాశిస్తున్నది. బ్రహ్మమే ప్రపంచరూపంగా పరిణమిస్తున్నది– అని అంటే, అప్పుడు బ్రహ్మానికి స్వరూప వికారం ఏర్పడుతున్నది. ఈ విధంగా పలికితే, భగవంతునకు ఏ వికారం లేదు అని తెలిపే నిర్వికారశ్రుతులకు విరోధం ఏర్పడుతుంది కదా. దీనికి ఏవిధంగా సమాధానం చెప్పడం? అనే ప్రశ్న ఏర్పడితే, ఈ విధంగా కాదు, కారణత్వావస్థలోను కార్యత్వావస్థలోనూ బ్రహ్మను విడిచి ఉండకుండా, దానితో చేరి ఉండే వస్తువులే కార్యావస్థలో స్థూలరూపమైన స్వరూప స్వభావ వికారాలను పొందుతున్నాయి. కారణావస్థలో అవి తన కారణంలో సూక్ష్మంగా లయిస్తున్నాయి. చిత్తులకు స్వరూప వికారం లేదు, స్వభావ వికారం మాత్రమే. అచిత్తులకు

అయితే, స్వరూప వికారం, స్వభావ వికారం అనే రెండూ ఉన్నాయి. చిత్తులకు స్వరూప వికారం అనేది –జ్ఞాన వికారం. ఆచిత్తుకు స్వరూప వికారం అనేది– సూక్ష్మ రూపాన్ని విడచి, స్థూల రూపాన్ని పొందడం. స్వభావ వికారం అనేది– కొత్తగా ఆవిర్భవించే రూప రస గంధ స్పర్శ శబ్ద గుణాలతో కూడి ఉండడం. ఈ వికారాలు బ్రహ్మలో విశేషణాలుగా ఉండే చిద్వస్తువులలోనూ, అచిద్వస్తువులలోనూ సంభవిస్తున్నాయి తప్ప, విశేష్య భూతమైన బ్రహ్మలో ఏ విధంగానూ సంభవించడం లేదు. అది రెండు అవస్థలలోనూ, అంటే, స్థూలావస్తలోనూ, సూక్ష్మావస్థలోనూ, నిర్వికారంగానే ఉంటూ, జ్ఞానానందమయంగాను, దేశ కాల వస్తు పరిచ్ఛేదం లేనిదిగాను, అమలంగానూ జ్వలిస్తున్నది. విశిష్టవస్తువు వికారాన్ని పొందేటప్పుడు, వికారం భేదం లేకుండా, ఏ తేడా లేకుండా సంభవించవలసినదిగా ఉండగా, ఏ విధంగా విశేషణాంశాలుగా ఉండే చిదచిత్తులలో మాత్రం పరిణామం సంభవిస్తున్నది? అని అంటే, మూడు వస్తువులకు స్వరూప స్వభావాలు వ్యవస్థితాలుగా ఉన్నందున, ఈ మూడు చేరి ఉన్నందువల్లనే ఒక దానికి ఉండే స్వభావం మరొకదానికి రావడంలో హేతువు లేదు. విశేషణంగా ఉండే చిత్తు యొక్క సంబంధం చేత బ్రహ్మకు వికారం అంగీకరించినట్లయితే, బ్రహ్మం అపురషార్థాలకు ఆస్పదం అవుతుంది, ఆ విధంగానే, అచిత్సంబంధంచేత బ్రహ్మకు వికారం కలిగినట్లయితే, స్వరూప స్వభావ అన్యథా భావాలు సంభవించవలసి వస్తుంది. నిర్వికారశ్రుతిబలం చేత అవి అన్నీ నిరాకరింపబడ్డాయి. ఏ అవస్థలోను బ్రహ్మకు వికారం ఏర్పడదు. ఎరుపు, తెలుపు, నలుపు అనే గుణాలు కల మూడు దారాలతో నేయబడిన ఒక వస్త్రంలో, ఏ ఏ చోట్ల ఏ ఏ నూలులు కూడి ఉన్నాయో, ఆ యా చోట్ల ఆ యా రంగులు ఉంటాయి తప్ప, వాటి చోటు మారి వర్ణాలు కలసి కనబడడం లేదు. ఆ విధంగానే, కారణావస్థను పురస్కరించుకొని కార్యావస్థను పొందే సమయంలో నిర్వికారస్వభావం కల బ్రహ్మం నిర్వికారంగానే ఉంటున్నది. కారణావస్థలో స్వభావసంకోచాన్ని కలిగినదై ఉండే ఉండే చిత్తు కార్యావస్థలో జ్ఞానవికాసరూపమైన స్వభావవికారాన్ని పొందుతున్నది. ఈ విధంగానే, కారణావస్థలో సంకుచిత స్వరూప స్వభావాలను కల చిత్తు కూడా కార్యావస్థలో స్థూల స్వరూప వికారాన్ని, వ్యక్తమైన రూపరసగంధ స్పర్శ శబ్ద రూప వికారాలను పొందుతున్నది. అందుచేత, చిదచిత్తులను శరీరంగా కలిగి ఉన్నప్పటికీ కూడా, వాటి సంబంధం కల బ్రహ్మకు అపురుషార్థాశ్రయత్వం, స్వరూప స్వభావ వికారం సంభవించవు. అయినప్పటికీ, కార్యావస్థలో కార్యదశలో స్థూలనియంతృత్వ రూపమైన వికారం బ్రహ్మను తప్పక పొందుతుంది. ఇటువంటి వికారం

బ్రహ్మకు వచ్చినట్లయితే, ఏ విధమైన శ్రుతివ్యాకోచం లేనందుచేత, అది మాత్రం అంగీకరింపబడింది.

"అథాతో ధర్మజిజ్ఞాసా" అనే సూత్రంనుండి ఆరంభించి, "అనావృత్తిః శబ్దాత్, అనావృత్తిఃశబ్దాత్" అనే సూత్రం వరకు ఉండే 20 అధ్యాయాలను కలిగిన సూత్రాలు అన్నీ కర్మకాండం, బ్రహ్మకాండం అని వ్యవహరింపబడే రెండు భాగాలను కలిగిన వేదమనే ఒక ప్రబంధానికి వ్యాఖ్యానం కనుక, ఇది అంతా ఒకే శాస్త్రం. ఈ విషయంలో బోధాయనమహర్షి పల్కిన "సంహితమేతచ్ఛారీరకమ్ జైమినీయేన షోడశలక్షణేన శాస్త్రైకత్వసిద్ధిః" అనే వచనం ముఖ్య ప్రమాణం. వీటిలో, ముందు భాగమైన పూర్వ మీమాంసాశాస్త్రంతో పశుపుత్ర వృష్టి అన్న స్వర్గాది ఐహికాముష్మిక ఫలాలకు సాధనమైన ధర్మం నిరూపింపబడుతున్నది. ఉత్తర భాగమైన శారీరక మీమాంసాశాస్త్రంలో బ్రహ్మస్వరూపం నిరూపింపబడుతున్నది. ఈ శారీరక మీమాంసాశాస్త్రంలో, పూర్వద్వికమని వ్యవహరింపబడే మొదటి రెండు అధ్యాయాలతో చేతనాచేతనాల కంటే విలక్షణమై, సకల జగత్తులకు కారణమై ఉండే బ్రహ్మస్వరూపం నిరూపింపబడుతున్నది ఉత్తరద్వికం అనబడే, తరువాత ఉండే రెండు అధ్యాయాలతో క్రమంగా ఉపాసనం, ఫలం నిరూపింపబడుతున్నవి. అందులో కూడా, సమన్వయాధ్యాయం అనే మొదటి అధ్యాయంలో, బ్రహ్మకు జగత్కారణత్వం నిరూపింపబడుతున్నది. అన్ని కారణ వాక్యాలు పరబ్రహ్మలో చక్కగా దీనికి సమన్వయిస్తాయి కనుక, సమన్వయం అని అన్వర్థమైన నామధేయం ఏర్పడింది. ఇందులో కూడా, మొదట ఉండే నాలుగు సూత్రాలతో "ఈ వేదాంత శాస్త్రం ఆరంభించవలసిన ఆవశ్యకత లేదు" అనే సందేహం నిరాకరింపబడి, శాస్త్రారంభ సమర్థనం చేయబడినందున, ఈ నాలుగు సూత్రాలు కలసి ఒకే పేటిక అని వ్యవహరింపబడుతున్నది.

ఈ శారీరక శాస్త్రంలో ప్రాధాన్యాన్ని కలిగిన మొదటి నాలుగు సూత్రాలతో క్రమంగా– శాస్త్రంలోని ఆరంభానికి మూలమై ఉండే వ్యుత్పత్తి లేకపోవడం, ప్రతిపత్తి థౌర్థ్యం, వేరొక ప్రమాణంతో బ్రహ్మ స్వరూప నిరూపణం సిద్ధించడం, ఫలం లేకపోవడం– అనే ఈ నాలుగు సందేహాలు నివారింపబడ్డాయి. మొదటి అధ్యాయంలోని మొదటి పాదంతో బ్రహ్మం జగత్కారణమే అనే విషయం, మిగిలిన మూడు అధ్యాయాలతో బ్రహ్మమే జగత్కారణం అనే విషయం స్థాపింపబడుతున్నది. ఇందుచేత బ్రహ్మ లక్షణానికి మందబుద్ధులచే సందేహింపబడే అసంభవ, అవ్యాప్త్యాది దోషాలు పరిహరింపబడ్డాయి. ఈ విధంగా మొదటి అధ్యాయంతో చిదచిద్విలక్షణంగా, జ్ఞానానంద స్వరూపిగా,

అపరిమితోదార గుణ సాగరంగా, నిఖిలజగదేక కారణంగా, సర్వాంతరాత్మగా ఉండే బ్రహ్మం వేదాంతాల చేత తెలియదగినది– అని చెప్పబడింది. తరువాత, ఈ అర్థం ఏ విధంగాను ప్రమాణాలతో గానీ, యుక్తులతో కానీ, న్యాయాలతో కానీ, కాదనడానికి వీలు లేనిది –అనే విషయాన్ని నిరూపించడం కోసం రెండవ అధ్యాయం ఆరంభమయినది. దీనికి అవిరోధాధ్యాయం అని పేరు. ఇంతకుముందు చెప్పబడిన విషయాలలో శ్రుతులకు, ప్రమాణాలకు, స్మృతులకు, న్యాయాలకు విరోధం లేకపోవడం ఇందులో నిరూపింపబడినందున దీనికి ఈ పేరు కలిగింది. ఈ అధ్యాయం స్మృతి పాదం, తర్కపాదం, వియత్పాదం, ప్రాణపాదం అనే నాలుగు పాదాలతో కూడినది. మొదటి అధికరణమైన స్మృత్యధికరణలో సాంఖ్యస్మృతి విరోధం ఏర్పడినందున, వేదాంతాలకు బ్రహ్మపరత్వం చెప్పడానికి లేదు– అని వాదించే సాంఖ్యుల ప్రత్యవస్థానాన్ని ఉద్దేశించి, వేదం చేత కీర్తింపబడుతున్న మనుస్మృతి మొదలైన, తత్వార్థ ప్రతిపాదకాలైన అనేక స్మృతులకు విరోధం ఏర్పడుతున్నందున, భ్రమ, విప్రలంభం, ప్రమాదం మొదలైన దోషాలను కలిగిన పరిమిత ప్రజ్ఞను కల కపిల ఋషి నిర్మించిన స్మృతి అనేది ఆదరించదగినది కాదు– అనే విషయం ప్రమాణాలతో, వాటికి ఉపష్టంభకాలైన యుక్తులతోనూ నిరూపణం చేయబడింది. దానికి తరువాత, అధికరణంతో అబ్రహాత్మకప్రధాన కారణవాది అయిన హిరణ్యగర్భునిచే చెప్పబడిన యోగస్మృతి కూడా శ్రుతివిరోధం కారణంగా నిరాకరింపబడింది. తరువాత, క్రమంగా పాశుపతమతం మొదలైన బాహ్యమతాల సిద్ధాంతాలు నివారింపబడి, పరపక్ష నిరసనాన్ని పురస్కరించుకుని స్వపక్షస్థాపనం చేయబడింది.

మూడవ అధ్యాయమైన ఉపాసనాధ్యాయంతో బ్రహ్మ ప్రాప్తికి ఉపాయం ఏది? అనే విషయం చింతింపబడుతున్నది. ఇది వైరాగ్యపాదం, ఉభయ లింగ పాదం, గుణోపసంహార పాదం, అంగ పాదం–< అని 4 పాదాలను కలిగినది. బ్రహ్మ ప్రాప్తికి ఉపాయభూతమైన ఉపాయంయొక్క చింతన ఇక్కడ చేయబడుతున్నది. పొందదగిన బ్రహ్మం తప్ప, మిగిలిన వస్తువుల విషయంలో సంబంధం కలిగి ఉండకపోవడం, పొందదగిన పరబ్రహ్మ విషయంలో ఆశ, ఉపాసనారంభానికి గొప్పవి అయిన ఉపాయాలతో అవి సిద్ధించడంకోసం, జీవునకు లోకాంతరసంచారంలోనూ, జాగరణ స్వప్నాది దశలలోను సంభవించే దోషాలు, బ్రహ్మకు అటువంటి దోషాలు ఏమీ లేకపోవడం, సమస్త కళ్యాణ గుణాలకు ఆకరమై ఉండడం –అనేవి క్రమంగా మొదటి రెండు పాదాలతో ప్రతిపాదింపబడ్డాయి. మూడవ పాదంలో బ్రహ్మోపాసనల గుణోపసంహార వికల్ప నిర్ణయాలకోసం విద్యల భేదాభేదచింత ఆరంభింపబడింది. నాలుగవ అధ్యాయంలో విద్య

చేత పురుషార్థమా, లేక, విద్యను అంగంగా కలిగిన కర్మచేత పురుషార్థమా? అనేది విచారింపబడింది. ఈ విధంగా మూడవ అధ్యాయంతో సాధనాలతోపాటు విద్య చింతింపబడినది. నాలుగవది అయిన ఫలాధ్యాయంలో విద్యాస్వరూప శోధనాన్ని పురస్కరించుకొని విద్యాఫలం చింతింపబడుతున్నది.

విశిష్టాద్వైత వేదాంతసిద్ధాంతంలో –పుణ్యం, పాపం –అనే రెండు కర్మలు తీరి, కర్మబంధనుండి విడివడి, మూర్ధన్యనాడి ద్వారా ఉత్క్రమించి, దేవయాన మార్గంలో అప్రాకృతమైన స్థానవిశేషాన్ని చేరి, భగవంతుని సాన్నిధ్యాన్ని పొంది, తన శిరస్సుపై ఆ పరమ పురుషుని చరణారవింద సంబంధాన్ని పొంది, గుణాష్టకావిర్భావాన్ని పొంది, తిరిగి ప్రకృతి సంబంధాన్ని పొందకుండా, పరబ్రహ్మతో ఏ తేడా లేకుండా అఖండమైన పరిపూర్ణానందాన్ని జీవుడు అనుభవించడమే మోక్షం –అని అంటున్నారు. ఈ పరమపురుషార్థప్రాప్తియే వేదాంత శాస్త్రానికి పరమ ప్రయోజనం.

ఈ నాల్గవ అధ్యాయంలోని మొదటి భాగంలో బ్రహ్మ ప్రాప్తికి సాధనంగా విధింపబడిన వేదనం అనేది ఒకసారి అనుష్ఠిస్తే చాలు –అనేదే శాస్త్రాభిప్రాయమా? లేక, మాటిమాటికి అనేక పర్యాయాలు అనుష్ఠించవలసి ఉన్నది– అనేది శాస్త్రాభిప్రాయమా ?అని విచారించి, వేదనం పలుమార్లు చేయవలసినదే– అనేది స్పష్టంగా నిర్ణయం చేయబడింది. రెండవ పాదంతో జీవుని ఉత్క్రాంతి ప్రకారం చింతింపబడుతున్నది. మూడవ పాదంతో మూర్ధన్యనాడి ద్వారా ఉత్క్రమించి వెళ్లే విద్యానిష్ఠుని మార్గం ఎటువంటిది? అనే విషయం నిర్ణయింపబడినది. ఈ విధంగా బ్రహ్మను ఉపాసించేవారు కూడా ప్రకృతి వియుక్తంగాను, బ్రహ్మాత్మకంగానూ ప్రత్యగాత్మ స్వరూపాన్ని ఉపాసించేవారికి మళ్ళీ తిరిగి సంసారంలో తిరిగి రావడం అనేది లేని రీతిలో ఉండే గమనం చెప్పబడింది. నాలుగవ పాదంతో ముక్తుల ఐశ్వర్య ప్రకారం చక్కగా, విస్తృతంగా ఉపపాదింపబడింది.

వేదనం, ఉపాసనం, ధ్యానం, భక్తి, అను ధ్యానం అనే ఈ పదాలు అన్ని పర్యాయపదాలు. నిధిధ్యాసనా –అనే ఒకే అర్థాన్నే ఇవి అన్ని తెలుపుతున్నాయి. నిదిధ్యాసనం అంటే– ప్రత్యక్ష సమానాకారమైనది, తైలధారవలె ఎక్కడా అంతరాయం లేకుండా ఉండేది, ఉత్క్రమణ కాలం వరకు అనువర్తించదగినది, ప్రతి దినం అభ్యాసంచేత ఏర్పడదగినది, మిక్కిలి గొప్పది అయిన పరమ పురుషుని విషయంలోని ప్రీతి రూపమైన స్మృతి సంతతియే ఇది పరభక్తి, పరజ్ఞానం, పరమ భక్తి అని ఉత్తరోత్తరం అతిశయాన్ని కలిగిన మూడు దశలతో కూడినది. ఈ భక్తియే మోక్ష సాధనం అనేది ఈ వేదాంత శాస్త్రంలోని పరమ తాత్పర్యం.

దీనిని ఉద్దేశించే ఈ శ్రీ భాష్య గ్రంథంలో ఆరంభంలోనే “శేముషీ భక్తిరూపా” అని ఈ గ్రంథకర్త అయిన శ్రీభాష్యకారులు భక్తినే ఆశంసించారు. భక్తిమార్గంలో ప్రవేశించదగిన సామర్థ్యం లేనివారికి ప్రపత్తియే మోక్ష సాధనంగా అనుష్ఠించదగినది. ఇదే సులభంగా ఆ పరమ పురుషుని వశీకరించు కోవడానికి తగిన సాధనం. ఈ అర్థాన్ని “తస్య వశీకరణం తచ్ఛరణాగతిరేవ “అని శ్రీభాష్యకారులే ఈ గ్రంథంలో అనుమానికాధికరణంలో అనుగ్రహించారు. భక్తిలో త్రైవర్ణికులకే అధికారం ఉన్నది. మిగిలినవారికి లేదు– అని శాస్త్ర నియమం. భక్తి అనేది అవధానంచేత, చిరకాలం కారణంగా, శక్తిచేత, జ్ఞానంచేత, కాల విలంబసహన శక్తిచేత, నిరంతరంగా అనుష్ఠించడంచేత సాధించదగినదిగా ఉన్నందున ఆశక్తులకు అసాధ్యమే. ప్రపత్తి అయితే, ఏ విధమైన వర్ణవ్యవస్థ లేకుండానే, బ్రాహ్మణుల దగ్గర నుండి అందరికీ సులభంగా అనుష్ఠించదగినదిగా ఉన్నది కనుక, సులభం కనుక, ఒకసారి ఒక్క క్షణం చేయదగిన కార్యంగా ఉన్నందువల్ల, అంతిమ స్మృతిని అపేక్షించకుండానే మోక్షరూపమైన పరమ పురుషార్థాన్ని ఇచ్చే స్వభావాన్ని కలిగినందున దీనినే అశక్తులు ఈ కలియుగంలో అవలంబిస్తున్నారు.

ఈ శ్రీభాష్యగ్రంథంలో మహాత్ములైన శ్రీభాష్యకారులచే అన్యమతాలు పూర్తిగా నిరసింపబడ్డాయి. ఆ సిద్ధాంతాలలో ఏ ఏ అంశాలు వేదవిరుద్ధాలో, అవి నిరసింపబడ్డాయి. ఇందులో, ప్రత్యక్షం, అనుమానం, శబ్దం– అనే మూడు ప్రమాణాలే అభ్యర్హితాలు కనుక, అంగీకరింపబడ్డాయి. శ్రుతితాత్పర్యాన్ని చక్కగా పరామర్శించి, చిదచిదీశ్వరతత్త్వ వ్యవస్థలు నిర్ణయం చేయబడ్డాయి ఇందులో తత్త్వాలు 26. పక్ష భేదంచేత కాలాన్ని కూడా చేర్చి 27 తత్త్వాలు– అని కూడా చెబుతారు. శుద్ధసత్త్వాన్ని చేర్చి 28 తత్త్వాలు– అని కూడా చెప్పడం ఉన్నది. ఆత్మలు, –బద్ధులు, ముక్తులు, నిత్యులు– అని మూడు విధాలయినవారు. మోక్షదశలో ముక్తుడైనవానికి బ్రహ్మతో బ్రహ్మ యాథాత్మ్యానురూపమైన భోగమాత్రంలో సామ్యం ఉన్నది. లోకాలను సృష్టించడం, లయం చేయడం, రక్షించడం– అనే ఈ మూడు అసాధారణమైన బ్రహ్మ కృత్యాలే. ఈ మూడిటితో పాటు లక్ష్మీపతిత్వం కూడా ఆ బ్రహ్మకే అసాధారణం.

★★★★★

# 3. శారీరకావతారిక

("వాగమృతవర్షి" , ఉ. వే. శ్రీమాన్. వేళుక్కుడి వరదాచార్యస్వామివారి "సుధారసమంజరి" అనే ద్రావిడగ్రంథం మొదటిభాగంనుండి గ్రహింపబడి, ఆంధ్రీకరింపబడింది)

స జయతి జైమినిరాదౌ జయతి పునః కాశకృత్స్నోపి।
నారాయణావతారో జయతి పరం బాదరాయణః శ్రీమాన్॥

"అథాతో ధర్మజిజ్ఞాసా" అని ఆరంభించి, "అనావృత్తిః శబ్దాత్, అనావృత్తిః శబ్దాత్" అనే పర్యంతంగా ఉండే 20 అధ్యాయాలను కలిగిన మీమాంసా శాస్త్రం ఒకే శాస్త్రం అని పెద్దలు అంటారు. "సంహితమ్ ఏతచ్ఛారీరకమ్ జైమినీయేన షోడశలక్షణేన ఇతి శాస్త్రైకత్వసిద్ధిః" అని వృత్తికారులైన శ్రీబోధాయనులు అనుగ్రహించారు. "అంగాని వేదాః చత్వారః మీమాంసా న్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా చతుర్దశ" అని 14 విద్యా స్థానాలను చెప్పేటప్పుడు మీమాంసా అని ఏకవచన ప్రయోగంతో మీమాంసా శాస్త్రం ఒకటే అని చెప్పబడింది. వేదత్వం నాలుగు వేదాలకు అవిశిష్టంగా ఉండగా, వేదాలను నాలుగు విద్యాస్థానాలుగా విభజించి చెప్పబడినది కదా. పురాణాలు, ధర్మశాస్త్రాలు వేదోపబృంహణాలుగా ఉన్నప్పటికీ, "పురాణం ధర్మశాస్త్రం చ" అని రెండు విద్యాస్థానాలుగా విభజించి చెప్పబడినదికదా. ఆ విధంగానే, కర్మ మీమాంస, దేవతా మీమాంస, బ్రహ్మ మీమాంస– అనే మూడు "మీమాంసా" అని ఒకే పదంతో చెప్పబడినప్పటికీ, మూడిటిని ప్రత్యేకంగా మూడు శాస్త్రాలుగానే గ్రహించవచ్చు కదా! అని అంటే, ఆ విధంగా కాదు. అనాది సిద్ధమైన వ్యవహారం చేత వేదాలు నాలుగు అని, పురాణం ధర్మశాస్త్రం అని విభాగించి చెప్పిన వ్యవహారంచేత ఆ విధంగా వాటిని వేరు వేరుగా చెప్పడం కుదురుతుంది. మీమాంస ఈ విధంగా ఎక్కడ ఏ సమయంలోనూ మూడు విభాగించి చెప్పబడలేదు. ఏకవచన ప్రయోగంతోనే అంతటా కనపడుతున్నది. అందుచేత ఒకే శాస్త్రం కర్మం, దేవత అనేవి వేదార్థం. బ్రహ్మం వేదాంతార్థం.

కర్మ విచారం కర్మకాండంలో, దేవతా విచారణ దేవతాకాండంలో, బ్రహ్మవిచారం బ్రహ్మ కాండంలో చేయబడుతున్నవి.

"కర్మదేవతా బ్రహ్మగోచరా సా త్రిధోద్బభౌ సూత్రకారతః,
జైమినేః మునేః కాశకృత్స్నతః బాదరాయణాత్ ఇత్యతః క్రమాత్"

అని శ్రీ పరాశర భట్టర్ తత్త్వ రత్నాకరంలో అనుగ్రహించినదానిని చూసినప్పుడు, కర్మ, దేవతా, బ్రహ్మమీమాంస శాస్త్రాలు మూడు కర్తృభేదంతోనూ, విషయభేదంతోను మూడు అని తోచినప్పటికీ, ఇంతకుముందు ప్రస్తావించబడిన బోధాయన వృత్తి గ్రంథంతో దీనికి అవిరోధాన్నే గ్రహించాలి. పరాశర భట్టర్, బోధాయనులు అనే ఇద్దరూ మనకు ఆప్తతములు. వారు ఇద్దరూ అభియుక్తాగ్రేసరులు. అందుచేత ఈ ఇద్దరి వచనాలలో దేనినీ బాధ్యంగా గ్రహించకుండా, రెండు వచనాలను కూడా ప్రమాణంగా గ్రహించడమే మనకు యుక్తం. "జైమినీయేన షోడశలక్షణేన" అని బోధాయనులచే స్ఫుటంగానే 16 అధ్యాయాలు అని చెప్పబడినందున, భట్టర్ దేవతాకాండం కాశకృత్స్న ప్రోక్తం అని చెప్పడం, అది జైమినిచే రచింపబడినది అయినప్పటికీ, కాశకృత్స్నులచే ప్రకాశింప చేయబడినది –అనే తాత్పర్యంతో చెప్పబడింది– అని గ్రహించాలి.

కర్తృభేదం శాస్త్రభేదకం కాదు– అనేదానిని పలు పలు సాక్ష్యాలను బట్టి మనం తెలియవచ్చు. ఆపస్తంబసూత్ర వ్యాఖ్యానం ధూర్త స్వామి, కపర్ది అనే ఇద్దరిచే చేయబడినప్పటికీ, వ్యాఖ్యేయమైన, మూలమైన ఆపస్తంబసూత్ర గ్రంథంలోని ఐక్యంచేత అది ఒకటే శాస్త్రం– అని మనం గ్రహిస్తున్నాము. వామనులు, జయాదిత్యులు అనే ఇద్దరు పాణిని సూత్రాలకు పూర్వోత్తర వృత్తి గ్రంథాలను రచించినప్పటికీ, వ్యాఖ్యేయ గ్రంథం యొక్క ఐక్యంచేత దానిని ఒకటిగానే గ్రహిస్తున్నాము. మను స్మృతి మనువుచే ప్రారంభించబడి, భృగువుచే ఉపసంహరింపబడింది. అయినప్పటికీ అక్కడ శాస్త్రభేదాన్ని గ్రహించకుండా, ఒకటే శాస్త్రంగా గ్రహిస్తున్నాము. భోజరాజు, లక్ష్మణ సూరి అనే ఇద్దరిచే రచింపబడిన చంపూరామాయణం ఒకటే గ్రంథం అనే చెప్పబడుతున్నది. ఛాందోగ్యంలో ఉపకోసలవిద్యా ప్రకరణంలో ఉపదేష్టలు అనేకులుగా ఉన్నప్పటికీ, విద్యకు భేదం గ్రహింపబడడం లేదు. ఆ విధంగానే, ఇక్కడ కూడా, జైమిని, కాశకృత్స్నులు, వేదవ్యాసులు– అని కర్తలలో భేదం ఉన్నప్పటికీ శాస్త్రభేదం లేదు, ఒకటే శాస్త్రం అనే గ్రహించాలి.

కర్మ మీమాంసకు కర్మం, దేవతా మీమాంసకు దేవతలు, బ్రహ్మ మీమాంసకు బ్రహ్మం విషయం కనుక, ఈ మీమాంసలకు విషయభేదంతో శాస్త్రభేధాన్ని చెప్పవచ్చు కదా! అని అంటే, ఆ విధంగా కాదు. ఈ మీమాంసలకు అర్థైక్యాన్నే మన పూర్వాచార్యులు చెప్పి ఉన్నారు. అందుచేత శాస్త్రభేదం లేదు.

కర్మకాండలో చెప్పబడిన కర్మలు పరమాత్మ యొక్క ఆరాధనా రూపాలు. దేవతాకాండంలో చెప్పబడిన దేవతలు పరమాత్మకు శరీర భూతాలు. బ్రహ్మకాండలో

చెప్పబడిన బ్రహ్మం సర్వకర్మసమారాధ్యమైన, సర్వదేవతాంతాంతరాత్మ అయిన బ్రహ్మం, నారాయణశబ్దవాచ్యం అని ఒకే అర్థం మీమాంసాత్రయ సారంగా ఏర్పడుతున్నది. కనుక, ఇది ఒకటే శాస్త్రం అవుతున్నది.

సకలవేదవేద్యత్వం, సర్వధర్మ ప్రవర్తకత్వం, సర్వదేవతాంతరాత్మ కనుక సర్వకర్మ సమారాధనీయత్వం, సర్వధర్మ ఫలప్రదత్వం –అనే నాలుగు పరమాత్మ లక్షణాలు. ఇవి కాండత్రయసారం అవుతున్నవి.

అంతటా విచారింపబడేవాడు పరమాత్మయే. కర్మకాండలో ధర్మంగాను, దేవతాకాండంలో దేవతా శరీరకుడుగాను, బ్రహ్మకాండలో దేవత అనే కంచుకాన్ని తీసివేసి, సాక్షాత్తు పరమాత్మగాను విచారింపబడేవాడు అతడే– అని అంటారు, మన పెద్దలు.

"ధర్మే ప్రమీయమానే తు వేదేన కరణాత్మనా, ఇతికర్తవ్యతాభాగం మీమాంసా పూరయిష్యతి"

అనే వచనం ఇక్కడ స్మరించదగినది. వంట చెరకు కట్టెను రెండు భాగాలుగా చేయడం కోసం గొడ్డలి అవసరం అవుతుంది. అయినా, దానిని మోపి కట్టెపైన పడేటట్లు చేయాలి కదా. ఆ కట్టె రెండుగా కావడానికి కరణం గొడ్డలి. దానిని మోపి కిందకు చేర్చడం అనేది అంగం. "ఇతికర్తవ్యతా, అంగం" అనేవి పర్యాయాలు. ఆ విధంగానే, ధర్మ జ్ఞానానికి వేదం కరణం, వేదార్థవిచారమైన మీమాంసా శాస్త్రం ఇతికర్తవ్యత అవుతున్నది. ఇది లేకుండా వేదం ధర్మ ప్రమాణం కాలేదు– అని ఇక్కడ తాత్పర్యం. కర్మభాగార్థ విచారాన్ని కర్మమీమాంస చేస్తుంది. దేవతా భాగార్థవిచారాన్ని దేవతా మీమాంస చేస్తుంది. బ్రహ్మ పదార్థవిచార నిర్ణయాన్ని బ్రహ్మ మీమాంస చేస్తుంది– అని ఇక్కడ తాత్పర్యం.

"స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అని వేదం అధ్యయనాన్ని విధిస్తున్నది. ఇక్కడ అధ్యయనం సాంగ సశిరస్క వేదాధ్యయనం. అంగాలతో వేదాన్ని అధ్యయనం చేస్తున్నాడు. వేదశిరస్సు వేదాంతం. దానిని కూడా అధ్యయనం చేస్తున్నాడు.

"శ్రావణ్యాం ప్రోష్ఠపద్యాం వా ఉపాకృత్య యథావిధి,
యుక్తః ఛందాంస్యధీయీత యావాన్ విప్రః అర్ధ పంచమాన్" అని,
"అథ ఊర్ధ్వం తు ఛందాంసి శుక్లే తు నియతః పఠేత్,
వేదాంగాని చ సర్వాణి కృష్ణపక్షే తు సంపఠేత్"

అని మనువు చెప్పాడు. శీక్ష, వ్యాకరణం మొదలైన అంగాలతో పాటు వేద వేదాంతాధ్యయనం చేసినందున సంస్కృత ప్రాయదేశవాసంచేత అధ్యయనం చేసేవానికి వేదభాగంలోను, వేదాంత భాగంలోను ఆపాత ప్రతీతి కలుగుతుంది. వేదాధ్యయన విధి అంతవరకే అవుతున్నది. "ఎంతవరకు ఇతడు వేదం అనే అక్షర కూటాన్ని గ్రహిస్తున్నాడో, అంతవరకు"– అని అర్థం. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అనే విధి నియమ విధి అని అంటారు, మన పెద్దలు. అయినప్పటికీ, అక్షరరాశి గ్రహణం ఎంతవరకు కలుగుతుందో, అంతవరకు ఇది ఏర్పడుతుంది. అందుచేత ఈ విధి ఇంతటితో విశ్రాంతం అవుతున్నది. తరువాత, ఇతనికి భాగద్వయంలోను ఆపాత బుద్ధి ఏర్పడుతున్నది. అంగాలతోపాటు అధ్యయనం చేసిన తరువాత ఇతనికి రాగం కలుగుతున్నది. ఏర్పడిన ఆపాత ప్రతీతి నిశ్చయబుద్ధిగా కావాలి. సంశయాన్యథాజ్ఞాన విపరీత జ్ఞానభిన్న జ్ఞానమైన నిశ్చయాత్మక జ్ఞానం కలగాలి– అనే రాగం కలుగుతున్నది. అందుచేత వేదాంత విచారం చేయడానికి అతడు ప్రయత్నిస్తున్నాడు. "రాగాత్ మీమాంస్యతే" అని అర్థం. "స గురుమేవాభిగచ్ఛేత్" అని గురూపసత్తి విధి అవుతున్నది. ఇది అప్రాప్త ప్రాపకమైన అపూర్వ విధి కాదు, విచారం రాగప్రాప్తం అయినందున, ఈ విధి నియమ విధి అని అంటారు, పెద్దలు. ఆచార్యోపదేశ పూర్వకంగానే బ్రహ్మ విచారం చేయాలి– అనే నియమాన్ని తెలుపుతున్నది– అని భావం. ఇక్కడ అప్రవృత్త ప్రవర్తనం కాదు, అజ్ఞాత జ్ఞాపనం– అని అర్థం. ఈ విధంగా రాగం వల్ల విచారం ప్రసక్తమైనది. ఇతనికి అనాది సంసార సంబంధం చేత, మొట్టమొదట, త్రివర్గంలో, అంటే, ధర్మార్థ కామాలలో ప్రావణ్యం ప్రసక్తం అయినందున, తత్ప్రతిపాదకమైన వేద భాగాన్ని మొదట విచారిస్తున్నాడు. కర్మభాగ విచారంచేత ఏర్పడిన నిర్ణయాత్మకజ్ఞానం ఏ విధమైనది అంటే– "కర్మం అల్పమైన, అస్థిరమైన ఫలాన్ని ఇస్తుంది" అని. ఇక, ఇతడు వేదాంత భాగంలోని అర్థంలో ఏర్పడిన ఆపాత ప్రతీతిని మార్చుకొని, నిర్ణయాత్మకంగా చేసుకోవడం కోసం బ్రహ్మ విచారంలో ప్రవేశిస్తున్నాడు– అని అర్థం. అందుచేత బ్రహ్మ విచారం చేయడానికి ప్రయత్నించే అధికారికి రెండు బుద్ధులు ఉన్నాయి –అని తెలుస్తున్నది. పూర్వకాండార్థమైన కర్మను గూర్చిన నిశ్చయబుద్ధి కానీ, ఉత్తరకాండార్థమైన బ్రహ్మను గూర్చిన ఆపాత బుద్ధి గానీ, ఇవి రెండు కలిగిన విశిష్టాధికారియే బ్రహ్మవిచారాధికారి అవుతున్నాడు– అని అర్థం. పూర్వకాండార్థమైన కర్మం అల్పమైన, అస్థిరమైన ఫలాన్ని ఇస్తుంది– అనే నిశ్చయబుద్ధి లేకుండా పోతే, ఆ కర్మ విచారంలోనే ఆసక్తిని కలిగినవాడై ఉంటాడు తప్ప, బ్రహ్మవిచారానికి ప్రయత్నం చేయడు. అందుచేత, కర్మవిషయక అల్పాస్థిరఫలక నిర్ణయం ఆవశ్యకమవుతున్నది. ఇంతే కాక, ఉత్తర భాగార్థంలో ఆపాత ప్రతీతి

లేకుండా పోతే, బ్రహ్మవిచారాన్ని చేయడు. ఆపాత బుద్ధి కలిగినవానికే కదా "నిశ్చయబుద్ధి కలగాలి" అనే రాగం ఏర్పడుతుంది. అందుచేత, పూర్వకాండార్థంలో నిర్ణయం ఉత్తరకాండార్థంలో ఆపాత ప్రతీతి ఉండేవానికి బ్రహ్మ విచారం చేసే అధికారం ఉన్నదని ఏర్పడుతున్నది. దీనిని అంతటిని శ్రీ వేదవ్యాసులు మొదటి సూత్రంలో తెలియజేశారు. "అథ"– కర్మ విచారానికి తర్వాత, "బ్రహ్మజిజ్ఞాసా"– బ్రహ్మ విచారం (కర్తవ్యం అనే పదాన్ని అధ్యాహరించుకొని) చేయదగినది– అనే ప్రతిజ్ఞావాక్యం అవుతున్నది. పక్ష సాధ్యాలను చెప్పే వాక్యం ప్రతిజ్ఞా వాక్యం. సాధ్య విశిష్ట పక్ష బోధక వచనం కదా, ప్రతిజ్ఞా వాక్యం. "బ్రహ్మ జిజ్ఞాసా అథ" అని ప్రతిజ్ఞ. ఇక్కడ "బ్రహ్మ విచారం కర్తవ్యం" అని ప్రతిజ్ఞ కాదు. "కర్మ విచారానికి తరువాత బ్రహ్మవిచారం కర్తవ్యం" అనేదే ప్రతిజ్ఞ అని అన్నారు పెద్దలు. దానికి హేతువు "అతః "అని చెప్పబడుతున్నది. "కర్మ విచారహేతుకత్వాత్"–(కర్మ విచారాన్ని హేతువుగా కలిగినది కనుక) అని అర్థం. బ్రహ్మ విచారం కర్మ విచారానికి తరువాత కర్తవ్యం. బ్రహ్మవిచారం కర్మ విచారాన్ని హేతువుగా కలిగినది కనుక– అని హేతువు చెప్పబడింది. ఏది, దేనిని హేతువుగా కలిగినదో, అది, దానికి తరువాత కర్తవ్యం. వేదాధ్యయనానంతరం కర్మ విచారం వలె –అని వ్యాప్తి దృష్టాంతాలను గమనించవచ్చు. ధర్మ విచారానికి ఏ విధంగా వేదాధ్యయనం పూర్వ వృత్తమో, . ఆ విధంగానే, బ్రహ్మ విచారానికి కర్మ విచారం నియతంగా పూర్వ వృత్తం– అని అర్థం. అంటే, కర్మ విచారణతో "అది అల్పాస్థిరఫలాన్ని కలిగినది"అనే కర్మనుగూర్చిన నిశ్చయబుద్ధి ఏర్పడినందున, బ్రహ్మకాండార్థమైన బ్రహ్మను గూర్చి ఆపాత బుద్ధి కలిగినవాడు దాని నిర్ణయంకోసం రాగంతో బ్రహ్మవిచారం చేయడానికి తానే స్వయంగా వస్తున్నాడు– అని భావం. ఇది కదా విశిష్ట హేతువు. "ఇతడు రాగంతో విచారానికి వస్తున్నాడు" అనేదానిని సూత్రకారులే "బ్రహ్మజిజ్ఞాసా" అని సన్నంత పదప్రయోగంతో తెలియజేశారు.

"జిగమిషా, జిఘాంసా, వివిదిషా" అని అన్నట్లే, "జిజ్ఞాసా" అనే పదం కూడా ఇచ్ఛార్థకమైన సన్ ప్రత్యయంతో కూడినది అయినందున, "బ్రహ్మవిచారేచ్ఛ" అని తెలుపుతున్నది. ఇచ్ఛకు విధేయత్వం లేదు. అది విషయ సౌందర్యాధీనమే తప్ప, పురుషకృతి సాధ్యం కాదు. అందుచేత ఇచ్ఛకు విధేయత చెప్పడం ఇచ్ఛావిషయం అయిన విచారానికి విధేయత్వాన్ని చెప్పడమే.

ఇక్కడ మీమాంసకులలో ప్రభాకరుడు ఈ విధంగా అంటున్నాడు – సిద్ధార్థాన్ని శబ్దం బోధించదు. అందుచేత, వేదాంతవాక్యాలు సిద్ధవస్తువు అయిన బ్రహ్మను బోధించవు.

అందుచేత, సాంగ సశిరస్క వేదాధ్యయనం చేసినవానికి వేదాంత భాగంలో ఆపాత ప్రతీతియే కలుగదు. అందువల్ల విశిష్ట హేతువు సిద్ధించనందున బ్రహ్మ విచారం ఆరంభించదగినది కాదు– అని పూర్వపక్షాన్ని చేశాడు. కర్మ విషయమైన నిశ్చయబుద్ధి ఏర్పడినా, బ్రహ్మవిషయమైన ఆపాత ప్రతీతి ఉంటే కదా, విచారానికి అవకాశం ఉంటుంది. విశేషణాంశం ఉన్నప్పటికీ విశిష్టాశం లేకపోయినట్లయితే, బ్రహ్మ విచారం కర్తవ్యం కాదు. సిద్ధబ్రహ్మలో శబ్దాలకు వ్యుత్పత్తి లేదు– అని ప్రభాకరుడు పూర్వపక్షం చేశాడు.

ఇక్కడ శ్రీవేద వ్యాసులు సిద్ధవస్తు బోధకత్వం శబ్దానికి ఉన్నది– అని సిద్ధాంతం చేస్తున్నారు. అందుచేత, సిద్ధబ్రహ్మపరమైన వేదాంత భాగంలో బ్రహ్మ విషయకమైన ఆపాత ప్రతీతి ఉన్నది. అందులో నిశ్చయబుద్ధి ఏర్పడాలి– అనే రాగంతో విచారంలో ప్రవేశిస్తున్నాడు. అందుచేత, బ్రహ్మ విచారం కర్తవ్యం– అని ఏర్పడుతున్నది. ఇదే కదా, వేద వ్యాసుల అభిప్రాయపడిన పూర్వపక్ష సిద్ధాంతాలు– అని శీభాష్యంలో భగవద్రామానుజులు నిర్ణయించారు. ఈ విషయం "బ్రహ్మ జిజ్ఞాసా అథ, అతః" అనే సూత్రశబ్ద స్వారస్యం వల్ల స్పష్టమవుతుంది. శ్రీ జైమినిమహర్షి వేద భాగాన్ని విచారించి, న్యాయకలాపాలను చూపి, వేదభాగార్థాన్ని నిర్ణయించి, కర్మ మీమాంస అనే సూత్ర గ్రంథాన్ని అనుగ్రహించారు. దానిని మనం సేవించి, కర్మ "అల్పమైన, అస్థిరమైన ఫలాన్ని ఇస్తుంది"– అనే నిర్ణయాన్ని పొందడం తగినది.

అయినప్పటికీ, శ్రీజైమిని మహర్షి అనుగ్రహించిన సూత్ర గ్రంథానికి ముందు ఉన్నవారు ధర్మవిషయకాల్పాస్థిర ఫలక నిర్ణయాన్ని ఏ విధంగా పొందారు? అని ఒక సందేహం ఇక్కడ కలుగవచ్చు.

దీనికి సమాధానాన్ని మన పూర్వాచార్యులు తెలియజేశారు. జైమినివంటివారు ముందు మీమాంసాశాస్త్రం లేకపోయినప్పటికీ, తమ ప్రతిభా విశేషంతో యథార్థాలను నిర్ణయించుకోగలిగారు. వారికి వేదం స్వతః ప్రమాణం, నిరపేక్ష ప్రమాణం. మీమాంసానిరపేక్షంగానే స్వార్థాలను ప్రకాశింపజేస్తుంది. అయితే, అందరూ మీమాంసా నిరపేక్షంగానే వేదార్థాలను నిర్ణయించుకోవచ్చు కదా! అని చెప్పడానికి లేదు. అందరూ జైమిని మహర్షి వంటివారు కాదు కదా! ప్రతిపత్తృజ్ఞాన మాంద్యంచేత(తెలిసికొనేవారి జ్ఞానంలోని మంద బుద్ధి వల్ల) వేదార్థాలు విపరీతంగా తోచవచ్చు. అందువల్ల సంసారుల విషయంలో తమకు గల దయతో జైమిని మహర్షి తనకు తరువాత వచ్చేవారికి కర్మ విషయంగా నిశ్చయబుద్ధిని కలిగించే సూత్ర ప్రబంధాన్ని అనుగ్రహించారు. "విచారసాగరే

సంప్లవమానానామ్ జైమినినా యత్ కర్ణధారాయితం స ఏష క్షమ్యతామ్ అపరాధః." అని అంటూ "శతదూషణి గ్రంథంలో దేశికులు పలికినది నిశితంగా గమనించాలి. ప్రజ్ఞాపరాధ ప్రశమన రుచిభిః సూరిభిః సూత్రక్లుప్తైః" అని మీమాంసా పాదుకలో దేశికులు అనుగ్రహించారు. కర్మలు అనంత స్థిర ఫలాలను ఇస్తాయి– అని పూర్వపక్షం చేసి, కర్మలు అల్పమైన, అస్థిరమైన ఫలాలను ఇస్తాయి– అని కర్మకాండలో ఎక్కడ సిద్ధాంతం చేయబడింది? అని అంటే, సంవత్సరం అంతా చాతుర్మాస్యావృత్తి విధింపబడింది. దీనివల్ల ఏమి తెలుస్తున్నది? అంటే, ఆవృత్తి చేత కర్మలకు అక్షయ్యఫలత్వం కర్మలకు లేదని తెలుస్తున్నది. అక్షయ్యఫలత్వం ఉన్నట్లయితే వాటికి ఆవృత్తి అక్కరలేదు కదా. అందుచేత, కర్మం అల్పాస్థిరపలాన్ని ఇచ్చేది– అనే బుద్ధి పూర్వకాండ విచారణ చేత ఫలిస్తున్నది– అని అర్థం. దీనిని అంతటిని మొదటి సూత్రంలో కల "అథ "అనే శబ్దం ద్వారా వేదవ్యాసులు తెలియజేస్తున్నారు. ఇందువల్ల ఏమి తెలుస్తున్నది? అని అంటే, వేదాంతాలు సిద్ధబ్రహ్మను తెలియజే స్తాయి కనుక, సిద్ధబ్రహ్మ విషయక ఆపాత ప్రతీతిని కలవాడు, కర్మ అల్పమైన, అస్థిరమైన ఫలాన్ని ఇస్తుంది– అనే నిశ్చయబుద్ధి కలవాడు, బ్రహ్మవిషయకమైన నిర్ణయం పొందడం కోసం బ్రహ్మ విచారం చేయాలి–అని తెలుస్తున్నది. అందుచేత, "అథ" అనే పదానికి "కర్మ విచారానికి తర్వాత" అనే అర్థం ఏర్పడుతున్నందున, కర్మ బ్రహ్మవిచారాలకు పౌర్వాపర్యం ఈ విధంగా చెప్పబడింది.

పూర్వ మీమాంసలో పౌర్వాపర్యనిర్ణాయకాలైన ప్రమాణాలు ఆరు విధాలుగా చెప్పబడ్డాయి. శ్రుతి, అర్థ, పాఠ, స్థాన, ముఖ్య, ప్రవృత్తి క్రమాలు– అనేవి ఆ ఆరు. "పరీక్ష్య లోకాన్" అనే శ్రుతియే కర్మ విచారం పూర్వ వృత్తం, బ్రహ్మవిచారం ఉత్తర వర్తిష్యమాణం అనే విషయాన్ని తెలుపుతున్నది. ఇది శ్రౌతక్రమం. సంసారులకు త్రివర్గ ప్రావణ్యం స్వరసం. అందుచేత దానిని నిర్ణయించడానికి మొట్టమొదట కర్మ విచారణలో ప్రయత్నిస్తున్నాడు. ఇది "కర్మం అల్పమైన అస్థిరమైన పలాన్ని ఇచ్చేది" అనే నిర్ణయాన్ని కలిగిస్తుంది. తరువాత బ్రహ్మ విచారంకోసం ప్రయత్నిస్తున్నాడు. ఇది అర్థ క్రమం. వేద వేదాంతాలు అనే పాఠం ఉన్నందున, వేదార్థవిచారం ముందు, వేదాంతార్థ విచారం అనంతరం అనేది పాఠ క్రమం. "ఇషే త్వా" అని ఆరంబించి, "బ్రహ్మణో మహిమాన మాప్నోతి" అనే పర్యంతంగా గదా అధ్యయనం ఉన్నది. ఈ వ్యాఖ్యేయానికి ఈ విధంగా క్రమం ఉన్నందున, ముఖ్యంగా దీని క్రమాన్ని అనుసరించి దీనికి వ్యాఖ్యానమైన పూర్వోత్తర మీమాంసలకు ఈ క్రమం అనుసరించడం తగినది. వ్యాఖ్యేయశేషంకదా, వ్యాఖ్యానం. అందుచేత, ముఖ్య క్రమాన్ని చూసినప్పటికీ కర్మ విచారం పూర్వం, బ్రహ్మవిచారం ఉత్తరం– అని తెలుస్తుంది. ఇది ముఖ్య

క్రమం. ధర్మ ప్రమాణమైన వేదాన్ని మొదట అధ్యయనం చేయడం కోసం గురుకులానికి వెళుతున్నాడు. దానిని అధ్యయనం చేస్తున్నాడు. అక్షరరాశిని గ్రహిస్తున్నాడు. ఈ ప్రవృత్తులకు తరువాత విచారానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది ప్రవృత్తిక్రమం. వేదాధ్యయనానంతర కాలం కర్మ విచార కాలం అవుతున్నది. దానికి స్థానం అక్క. డ దానికి తరువాత బ్రహ్మవిచారానికి స్థానం. ఇది స్థానక్రమం. అందుచేత కర్మ బ్రహ్మ విచారాలకు ఈ విధంగా ఆరు విధాలైన క్రమ నియామక ప్రమాణాలతో పౌర్వాపర్యం సిద్ధిస్తున్నందున, "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనే చోట "అథ" శబ్దానికి కర్మ విచారానంతర్యాన్ని అర్థంగా చెప్పడం చాలా తగినది –అని తెలుస్తున్నది. తత్కాలంలో కర్మ విచారాన్ని చేసిన తరువాతనే బ్రహ్మవిచారంచేస్తున్నాడు– అనే అనుష్ఠానం కనబడడం లేదే? అని అంటే, దీనికి పరిహారాన్ని మూడు విధాలుగా మన పూర్వాచార్యులు తెలియజేశారు. అవి ఈ క్రింద తెలుపబడుతున్నాయి.

మీమాంసా ప్రకరణ గ్రంథాలతో పూర్వ మీమాంసా సారార్థాలను తెలుసుకొని, బ్రహ్మ విచారానికి రావచ్చు. లేక, సూక్ష్మబుద్ధి కలిగిన శిష్యులు ఆచార్యుని సన్నిధిలోని కర్మకాండార్థాలను సంగ్రహంగా తెలుసుకొని, బ్రహ్మ విచారాన్ని చేయవచ్చు. శారీరకార్థం ఉపదేశించే కాలంలోనే ఆచార్యుడు శిష్యునకు ఉపయుక్త పూర్వ మీమాంసా శాస్త్రార్థాలను సంగ్రహించి ఉపదేశించడం కూడా జరగవచ్చు– అనేవి ఆ మూడు సమాధానాలు. వీరు అముఖ్యాధికారులు. ఇంతకుముందు చెప్పబడినవాడే ముఖ్యాధికారి. ఏ విధంగా అయినా కర్మ బ్రహ్మ విచారాలకు నియత పౌర్వాపర్యం ఉన్నది, పూర్వోత్తర శాస్త్రాలకు ఐక్యం, బ్రహ్మవిచారారంభణీయత్వం– అనే అర్థత్రయం అక్షతం. అని తెలుతున్నది. "అర్థైకత్వాత్ ఏకం వాక్యం సాకాంక్షం చేత్" అని పూర్వ మీమాంసలో జైమినిమహర్షి అనుగ్రహించారు. సాకాంక్షమై, ఏకార్థ ప్రతిపాదకాలు పూర్వోత్తరకాండాలు–అని భావం.

పూర్వభాగాన్ని సేవించేటప్పుడు అక్కడ చెప్పబడిన కర్మలకు ఆరాధ్యుడు ఎవడు? అనే ఆకాంక్ష కలుగుతుంది. దానికి శాంతి ఉత్తరకాండ విచారం ద్వారా ఏర్పడుతుంది. ఉత్తరకాండలో చెప్పబడిన పరమాత్మకు ఆరాధనం ఏది? అనే ఆకాంక్ష కలుగుతుంది. దానికి శాంతి పూర్వకాండ విచారం ద్వారా కలుగుతుంది. అంతేకాక, పూర్వకాండలో చెప్పబడిన కర్మలకు అంగి ఏది? అనే శంక పూర్వకాండ మాత్ర దర్శనంతో కలుగుతుంది, ఉత్తరకాండ బ్రహ్మ విద్యకు అంగం ఏది? అనే శంక ఉత్తరకాండ దర్శనంతో కలుగుతుంది. ఈ రెండు శంకలకు సమాధానం కాండద్వయ పరామర్శ చేత ఏర్పడుతుంది.

అందుచేత, ఈ రెండు కాండలు పరస్పర సాపేక్షాలై, ఏకార్థప్రతిపాదకాలు అవుతున్నాయి. కర్మారాధ్యత్వ విశిష్ట బ్రహ్మ ప్రతిపాదకం(వైదిక కర్మల చేత ఆరాధింపబడే బ్రహ్మను ప్రతిపాదించేది)– అని కానీ, కర్మాంగకత్వ విశిష్ట బ్రహ్మ విద్యా ప్రతిపాదకం(వైదిక కర్మలను అంగంగా కలిగిన బ్రహ్మవిద్యను ప్రతిపాదించేది) – అని కాని, రెండూ ఒకే అర్థాన్ని ప్రతిపాదిస్తాయి– అని చెప్పవచ్చు. అందుచేత "మీమాంసా శాస్త్రం ఒకటే" అని చెప్పినట్లయినది ఈ విధంగా శారీరక ప్రథమసూత్ర ప్రథమ పదమైన "అథ" అనే శబ్దానికి– కర్మ విచారానంతరం –అనే అర్థాన్ని భగవద్రామానుజులు శ్రీభాష్యంలో అనుగ్రహించారు.

★★★★★

# 4. శారీరకంలో ద్వితీయాధ్యాయ ద్వితీయపాదసంగ్రహమ్

(ఉ. వే. శ్రీమాన్ ఉత్తమూర్ వీరరాఘవచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి ఆంధ్రానువాదం)

శారీరకంలో మొదటి అధ్యాయంలో సందేహానికి అవకాశం ఉండే ఉపనిషద్వాక్యాలను అన్నిటిని పరామర్శించి, జగత్కారణం పరబ్రహ్మం అనే అర్థం స్థాపించబడింది దానికి తరువాత కల అవిరోధాధ్యాయం అనే రెండవ అధ్యాయంలో యోగుల, జ్ఞానులైన పూర్వుల స్మృతులకు విరుద్ధమైనందున, యుక్తులకు పొసగనందున, ఈ అర్థం ఆక్షేపించగలిగినది అని అంటూ వచ్చిన పలు ప్రశ్నలను మొదటి పాదంలో సూత్రకారులు పరిహరించారు. ఆ తరువాత వేదానికి అదే అర్థమైన వేదం వలే అనుమానం కూడా ప్రమాణమైనందున అన్య మతాలను స్థాపించే తర్కాలు కూడా తగిన బలాన్ని కలిగినవి కదా అనే ప్రశ్న రాగా ఆ మతకర్కాలన్నీ దుర్బలాలే అని ఇందులో స్థాపిస్తున్నారు. విరక్తులైన వ్యాసులకు ఇతరులను దూషించడంలో నిజానికి ఉద్దేశ్యం లేదు. కానీ, వాటిని సమంగా తలచి, మన మతస్థులు దీనిలో నమ్మకం కోల్పోవచ్చు –అని భావించి వీరిని సంస్కరించడంలోనే వ్యాసులకు ఉద్దేశ్యం.

## దూషణ పౌర్వాపర్యంలోని హేతునిరూపణం

వైదిక మతమై, తర్కాన్ని ప్రధానంగా కలిగిన సాంఖ్యమతం, వైశేషిక మతం తరువాత వేదబాహ్య మతాలు నిరసింపబడ్డాయి. సాఖ్యం అనేది వేదంలోని ప్రకృతి, మహత్తు, అహంకారం మొదలైన వాటిని స్వీకరించి, యుక్తితో వాటిని స్థాపించినందువల్ల, ఆ మతం వేదానికి దగ్గర అయినది అని ముందు పాదంలో కపిల స్మృతిని ఎక్కువగా, అధికంగా గ్రహించినందున, బ్రహ్మసూత్రాలలో మొదటగా ఆ మతమే నిరసింపబడింది. అధికరణ సారావళిలో– సాంఖ్యులు, వైశేషికులు వేదం తెలియజేసిన పుణ్య పాపాలను అంగీకరించారు, తత్వాలను గూర్చి మాత్రం భిన్నంగా పలికారు, బౌద్ధ జైన మతాలలో తత్వం, ఆచారం అనే ఈ రెండిటిలోనూ తేడా ఉన్నది– అని అంటూ దేశికులు పలికిన సూక్తిని గమనించవచ్చు. సాంఖ్యం, వైశేషికం, నాలుగు బౌద్ధ మతాలు, జైనం, పాశుపతం అని 8 మతాలను దూషించి, చివరలో పాంచరాత్రానికి సంపూర్ణ ప్రామాణ్యాన్ని సూత్రకారులు స్థాపించారు. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழி ప్రబంధంలో " విళంబు మాఱు శమయముమ్ అవై యాకియుమ్ మற்றுమ్ తన్బాల్, ఆళందు కాండఱ్కరియనాకియ ఆదిప్పిరాన్ అమరుమ్" అని ఆరు మతాలని అనడం

బ్రహ్మసూత్రాలను అనుసరించేనా? లేక, వేరు అభిప్రాయంతోనా? అని అనేటప్పుడు, అక్కడ సాఖ్యం, యోగం, కాణాదం, గౌతమం బౌద్ధం, జైనం అని ఆరు మతాలని కొందరు అన్నారు. కానాధ గౌతమాలను ఒకటిగా చేసి పాశుపతాన్ని కూడా కలిపి ఆరు అని కొందరన్నారు. వైదికంలోనే సాంఖ్యం, యోగం, కాణాదం, గౌతమం, మీమాంసక మతం, వైయాకరణమతమని ఆరు మతాలు ఉన్నాయని మరికొందరు అన్నారు. వేద బాహ్య మతాలలో కూడా, బౌద్ధం నాలుగు, జైనం, పాశుపతం అని మొత్తం ఆరు విధాలు. చార్వాకం మృగ సాధారణంగ కనుక, అది మతమే కాదని అన్నారు, కొందరు. ఇక్కడ సూత్రకారులు బౌద్ధ మత నిరసనంలో నాలుగు బౌద్ధ మతాలకు నాలుగు అధికరణాలను రచించకుండా, కేవలం మూడే రచించారు. వైభాషిక సౌత్రాంతికులకు తత్వంలో భేదం లేదు. ప్రత్యక్ష ప్రమాణం ద్వారా బాహ్య వస్తువు తెలియపడుతుంది అని ఒకడు అంటే, అనుమాన ప్రమాణం ద్వారా తెలియబడుతుందని ఇంకొకడు అన్నాడు. అందుచేత వీరిద్దరి మధ్య ప్రమాణ భేదమే ఉన్నది. ఈ విధంగా బాహ్యాభ్యంతరం, అంతరం, శూన్యం అనే మూడు తత్వస్థితులను బట్టి మొత్తం బౌద్ధమతప్రకారాలను మూడుగా గ్రహిస్తే, అదేవిధంగా, శూన్యవాదం, క్షణిక వాదం అని బౌద్ధాన్ని రెండుగా చేస్తే, ఇక్కడ చెప్పబడిన మతాలు కూడా, $(6\times2=6)$ ఆరు కావచ్చు. సాంఖ్యం వేదాంత మతానికి చాలా దగ్గరది అందులో సత్కార్యావాదం. ప్రకృతి అనే అచేతనం జగత్కారణం, పరమాణువులు కాదు. సృష్టి క్రమం అయితే ఇంచుమించుగా వైదిక ప్రక్రియలోనే చెప్పబడింది. అయితే, పరబ్రహ్మను వారు అంగీకరించలేదు. సత్కార్యవాదంలో కూడా కొంచెం తేడా ఉన్నది. లోకంలోని కార్యాలన్నీ, కూర్మ శరీరంలో కొన్ని సమయాలలో కాళ్లవలె, కారణంలో అంతర్భవించి, కొన్ని సమయాలలో వ్యక్తం అవుతాయి. నూగింజలో నూనె ముందుగా ఉండేటట్లే, కార్యాలు పూర్వమే ఉండి వ్యక్తమవుతున్నాయి అని అంటారు. కానీ దీనిని తార్కికులు అంగీకరించలేదు. మట్టి ముద్దలో బానలు, చిన్న కుండలు అన్నీ అంతర్భవించి ఉన్నాయి అని అంటే, మట్టి ముద్దను పగలగొడితే అందులో అవి కనిపించాలి కదా అని వారు అంటారు. అందువల్ల ముందు లేని ద్రవ్యాలు కొత్తవి పుడుతున్నాయని అసత్కార్య వాదాన్ని వారు చేశారు. దీనిని ఆరంభణాధికరణంలో ఇంతకుముందే సూత్రకారులు నిరసించారు. ప్రామానణికమైన ప్రకృతి మొదలైన ద్రవ్యాలను విడచి, అప్రామాణికాలైన పరమాణువులను కల్పించి, అంతటితో ఆగకుండా, ఇంకా ఇంకా కార్యద్రవ్యాలను కల్పించి, వాటికి కొత్త కొత్త గా గుణాల ఉత్పత్తిని పలికి, అనంత ద్రవ్య గుణాలకు పలు జాతి విభాగాలు ఉన్నాయని జాతి అనే పదార్థాన్ని, పరమాణువులలో తేడా తెలియడం కోసం విశేషమనే పదార్థాన్ని, వీటిలో

ఆధారం– ఆధేయం అనే భేదం ఉన్నందున, అందుకోసం సమవాయమనే సంబంధాన్ని పలికి, ఇవి అన్ని భావపదార్థాలు, వీటి వలె అభావపదార్థాలు కూడా లెక్కలేనివి ఉన్నాయి– అని తార్కికులు అన్నారు. ఈ విధంగా ఇవి పలు పలు ఆభాస తర్కాలతో కూడిన కల్పనలు అని "అపరిగ్రహాచ్చాత్యంత మనపేక్షా" అని పైన బాహ్యాతుల్యంగా దూషించబోతారు, సూత్రకారులు.

దీనికి తరువాత బౌద్ధమత దూషణం చేయబడుతున్నది. బుద్ధుడు అంగీకరించినది శూన్యవాదమే. జ్ఞానంతోనే కదా దేనినైనా స్థాపించాలి! జ్ఞానం లేకపోతే శూన్యతత్త్వ స్థాపనం సాధ్యం కాదని ఒక శిష్యుడు అనగా, " దానిని మాత్రం గ్రహించు" అని అన్నాడు బుద్ధుడు. మొదటి వాదాన్ని అంగీకరించినవాడు మాధ్యమికుడు. చెప్పిన దానిని యథాతథంగా గ్రహించాడు. ఇదేమని ఎదురు పలుకలేదు. అందుచేత మధ్యముడు అయ్యాడు. తరువాత, జ్ఞానాన్ని మాత్రం అంగీకరించి, మిగిలినవి ఏమీ లేదన్నాడు, యోగాచారుడు. యోగం అంటే పర్యనుయోగం, ప్రశ్న. ఆచారమంటే అంగీకరించడం. ఈ రెండిటినీ కలవాడు ఇతడు. ఇతడు భాహ్యపదార్థమే లేదు, బాహ్య వస్తువులు ఉన్నట్లు తోచడం అంతా భ్రాంతివల్లనే అని అన్నాడు. బాహ్యవస్తువులు అనేవి లేకపోతెఏ, జ్ఞానం అంతా ఒకే విధంగా ఉంటుంది. తేడాను పలికే అవకాశమే లేదు. అయితే, జ్ఞానాన్ని చూసి బాహ్యవస్తువులను ఊహిస్తున్నాము తప్ప, చూడడం లేదు అని ఇంకొకడు అన్నాడు. దానిని కూడా బుద్ధుడు అంగీకరించాడు. ఈ విధంగా పలికిన తరువాత, ఉపదేశ సూత్రానికి నిర్ణయం ఇదే అని అన్నాడు, అతడు. అందుచేత అతడు సౌంత్రాంతికుడు కూడా అయ్యాడు. పూర్తిగా ప్రత్యక్షం అనేదే లేదు అంటే, అనుమానం అనేది లేకుండా పోతుంది కనుక, ప్రత్యక్షాన్ని ఒప్పుకున్నాడ, ఒకడు. అందుచేత అతడు వైభాషికుడు అనబడ్డాడు. ఈ విధంగా పేర్లను నిర్వచించడం సర్వసమ్మతం.

బౌద్ధ గ్రంథాలను గమనించినప్పుడు ఈ పేర్లకు వేరు అర్థం కూడా గోచరిస్తుంది. అశోక పుత్రుని కాలంలో మాగధ భాషలో విస్తరించిన బౌద్ధమతంలో సుత్తపిటకం, వినయ పిటకం, అభిధమ్మ పిటకం అనే త్రిపిటకంలో 18 విభాగాలు ఉన్నాయి. సుత్తపిటకాన్ని అనుసరించి సూత్రోపదేశం అని, వినయ పిటకాన్ని అనుసరించి వినయ పరిభాష అని, అభిధమ్మ పిటకాన్ని గురించి ఆభిధమ్మ విభాష అని సంస్కృత గ్రంథాలు పుట్టాయి. వాటిలో సూత్రోపదేశాన్ని అనుసరించినవారు సౌత్రాంతికులు, విభాషను అనుసరించినవారు వైభాషికులు. కనిష్కుని కాలంలో లంకావతార సూత్రంలో చెప్పబడిన మహాయానం అనే

వాదానికి మారుగా వచ్చిన హీనయానాన్ని పురస్కరించుకొని, " వాద మాత్రంతో ఉపయోగం లేదు. యోగాన్ని ఆచరించాలి" అని వాదించినవారు, యోగాచారులు. మాధ్యమికుడు అనేదానికి "మధ్యమ" అనేదానిని గ్రహించినవాడని అర్థం. అంటే, భావం అని గాని, అభావమని గాని పలుకకుండా, సర్వస్వభావం కాని శూన్య స్థితి మధ్యమం. పూర్వం పలికినట్లుగా శూన్యవాదమే శుద్ధ బౌద్ధమతం. మిగిలినవి తరువాత పుట్టాయి సూత్రకారులు ఇక్కడ తార్కిక మతాన్ని, తరువాత దానివలె బాహ్యేతర వస్తువులన్నటిని అంగీకరించిన బౌద్ధ మతాన్ని మొదట, దానికంటే నీచమైన యోగాచార మతాన్ని, తరువాత కేవల శూన్యవాదాన్ని చివర దూషించారు. కుతర్కాలు ఇంకా ఇంకా వృద్ధి అయ్యే కొద్దీ క్రమక్రమంగా శూన్యమని వాదించారు.

వీరిలో, తార్కికులు అన్నీ నిత్యం అనే సాంఖ్యవాదాన్ని విడచి, నిత్యం అనిత్యం అనే ఒక ప్రకారం ఉన్నదని ద్రవ్యాలలో అనిత్యాలు అనేకం అని తర్కించారు. బౌద్ధులలో, శూన్యవాదికి వస్తువే లేదు. మిగిలినవారిలో, జ్ఞానాన్ని మాత్రం అంగీకరించినవాడు, జ్ఞానం, బాహ్యవస్తువులు అనేవానిని అన్నిటిని అంగీకరించినవాడు, తాము అంగీకరించిన వస్తువులు క్షణికాలు. అవి ఒక క్షణానికి మించి నిలచి ఉండకుండా నశిస్తున్నాయి. ఆకాశంలోని మేఘం వలె ఒక్కొక్క నిమిషంలోనూ వేరువేరుగా ఉంటాయి, మన శరీరం కూడా ఆ విధంగానే అనుభవన్లో ఉంటుంది. దీపజ్వాలవలె భౌతిక వస్తువులన్నీ క్షణికాలే– అని పలికి– క్షణికవాదులయ్యారు. అందువల్ల వీరు వైనాశికులు. తార్కికులు కొన్ని వస్తువులు నిత్యమని అనడంచేత అర్థవైనాశికులు అనబడతారు. తార్కికుల వలె పరమాణు కారణవాదులే ఈ బౌద్ధులు. ఆయా గుణాల సముదాయమే ద్రవ్యం. రూపరసాది గుణాలన్నీ చేరినది, పృథివి. వాటిలో ఒక్కొక్కటి తగ్గినప్పుడు జలం మొదలైనవి అవుతాయి. పరమాణువుల చేరిక అనబడుతుంది. వేరు ద్రవ్యం అనేది లేదని వీరు అంటారు. వీరి మతంలో ఈ విధంగా పృథివి మొదలైన నాలుగు విధాలైన పరమాణువులు ఉన్నాయి.

జైనులు ఒకే విధమైన పరో పరమాణువులు నాలుగు విధాలైన భూతాలుగా మారుతున్నాయని అంటారు క్షణిక వాదం జైనులకు లేదు వీరికి అందరికీ పుణ్య పాపాలు ఉన్నాయి వేదబాహ్యులకు బుద్ధ, జిన ఉపదేశాలే మూల ప్రమాణాలు. వేదబాహ్యుల వలె కాకుండా, వైదిక వర్ణాశ్రమాలను అంగీకరించి, వైదిక ధర్మాలను అంగీకరించినట్లుగా తలపించి, తత్వస్థితిలో వలె ధర్మాధర్మ స్థితిలో కూడా వేద విరుద్ధాలైన పలు దారులను

చూపి, విపరీతమైన బుద్ధికి, ఆచారానికి అవకాశం ఇచ్చినందున పాశుపత మతాన్ని సూత్రకారులు చివరలో దూషించారు.

ఇక, చివరిగా పాంచరాత్రం. దీనికి ప్రామాణ్య స్థాపనం చేయబడలేదని ఆగమప్రామాణ్య గ్రంథాన్ని ఆళవందార్ అనుగ్రహించారు. అందులో, సూత్రాలకు పలు విధాలుగా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. శ్రీ రామానుజులు ఆళవందార్ పలికినదానిని సంగ్రహించి, సారాంశాన్ని పలికి, పాంచరాత్ర ప్రామాణ్యానికి తగిన కారణాలను విస్తరించి తెలిపి, ప్రామాణ్య స్థాపనాన్ని చేశారు.

### ఇందులో కొన్ని ఆక్షేపాలు ఏమంటే–

ఈ పాదం ఇతరమత దూషణానికి కదా, ఏర్పడింది. అందువల్ల పాంచరాత్రాన్ని దూషించడమే పొసగుతుంది. దానికి విరుద్ధంగా ప్రామాణ్య స్థాపనానికి ఇది చోటు కాదు– అనేది ఒక ఆక్షేపం.

దీనికి సమాధానం ఏమంటే, అప్పుడు, పాంచరాత్రాన్ని విషయంగా చేయకుండా, వేరు అప్రమాణ గ్రంథఖండనాన్నే చేయాలి. మాధ్వమతంలో ఆ విధంగా అంగీకరించారు. శాక్తమత ఖండనం ఇక్కడ చేయబడిందని మాధ్వులు అన్నారు. పాంచరాత్రమే ఇక్కడ విషయమని ప్రాచీన వ్యాఖ్యలు తెలుస్తున్నదిని అంటే అది ప్రామాణ్య స్థాపనం కోసమే ఎందుకంటే ఇది దర్గ పాదం ఆయా మతాల తర్కాలను ప్రతితర్కాలతో తిరస్కరించడమే ఇక్కడ విషయం. అదే విధంగా, పాంచరాత్రంలో తర్కమూలంగా ఏదైనా స్థాపించబడి ఉండి, దానిని చూపి యుక్తితో దానిని దూషించి ఉంటే, అది తగి ఉంటుంది. దానిని విడచి, జీవాదులను వేదం పలికిన రీతిలో పలుకకుండా, వేరు విధంగా చెప్పినందున ఇది అప్రమాణం అని వేద ప్రామాణ్యాన్ని పురస్కరించుకొని స్థాపిస్తునట్లు పలికినందున, ఇది తర్కపాదానికి చేరదు. అంతేకాక, పాంచరాత్ర ప్రామాణ్యాన్ని అంగీకరించినవాడు వేదప్రామాణ్యాన్ని అంగీకరించకుండా, వేదం పలికిన తత్వాచారాలను వీడి, దీనిని గ్రహిస్తే ఏమి ?అని పూర్వపక్షం చేయాలి. యుక్తితో ఆచార స్థాపనాన్ని చేయడం ఎవరికీ సాధ్యం కాదు. పాంచరాత్రంలో ఉండే తత్వస్థితికి, వైదికతత్వస్థితికి వ్యత్యాసం ఎక్కడ లేదు. పాంచరాత్ర ప్రసిద్ధమైన అర్థం సరిగా గ్రహిస్తే వైదిక విరోధం చెప్పే అవకాశం లేదు. ఈ విధంగా ఉండగా, వేదం అప్రమాణమని పాంచరాత్రికులై ఉండేవారు పూర్వపక్షాన్ని చేసే అవకాశం లేదు. మహాభారతాదులలో పాంచరాత్రాన్ని పొగడుతూ పలికే బాదరాయణుడు కూడా బ్రహ్మసూత్రాలలో దానిని తిరస్కరించలేదు. పాద సంగతి కూడా మనకు ఒక

విధంగా ఉన్నది పాంచరాత్ర విషయంలో ఇతర మత నిరాసంచేయడమే ఇక్కడ కార్యం. సాంఖ్యాది మతాలు ప్రమాణాలనే ఇతర మతాలను వలే, పాంచరాత్రం అప్రమాణం అనే ఇతర మతాన్ని దూషిస్తున్నారనే చెప్పాలి. ఈ విధంగా పల్కితే ఇది పాంచరాత్ర ప్రామాణ్యంలో అంతర్భవిస్తుంది. దీనిని శ్రీ భాష్యకారులు వివరించారు. ఆయా మతాలు వైదిక మతాన్ని ఎదిరిస్తాయనే అభిప్రాయం ఈ పాదంలో నిరసింపబడుతున్నది. ఇదే సంగతి సాంఖ్యంమొదలైన మతాల తర్కాలు ఆభాసతర్కాలు అయినందున ఎదురు లేదు. కపాంచరాత్రంలో విరోధం లేనందున ఎదురు లేదు అని అధికరణ సారావళిలో దేశికులు అన్నారు. పాంచరాత్ర వాక్యానికి మీరు పలికే అర్థాన్ని గ్రహిస్తే, అది సత్తర్కవిరుద్ధమైనందున, సాంఖ్యాది మతాలవలె దుర్బలం. అది ఎదిరించలేదు. అప్పుడు పాంచరాత్ర ప్రామాణ్యమే సిద్ధిస్తుంది– అనే భావించవద్దు మీరు పలికే అర్థాన్ని ఆ వాక్యానికి వాస్తవంగా అంగీకరించలేదే– అని అన్నారు సూత్రకారులు. ఇందులో సారాంశం శ్రీ భాష్యంలో తెలుపబడింది.

ఇంకొక విషయం గమనించాలి ఈ శారీరక మీమాంస జై మినీ మీమాంసను అనుసరించే ఉంటుంది. వారు చూపిన దారి ఉత్సర్గాపవాద స్థలాలలో ఉత్సర్గం కోసం ఉద్దేశింపబడిన పాదంలో అపవాదాన్ని చివరిలో గుర్తించాలి అనేదే. జైమిని రెండవ అధ్యాయంలో కర్మ భేదాన్ని స్థాపించి, సర్వ శాఖా ప్రత్యయ న్యాయంతో అభేదాన్ని పలికి ముగించారు. ఎనిమిదవ అధ్యాయంలో అతి దేశం స్థాపించేవారు, అతి దేశంల లేని సందర్భాన్ని చివరిలో చూపారు. అదే విధంగా. అప్రామాణ్యాన్ని మతాలకు స్థాపించి, పాంచరాత్ర ప్రమాణమని చివరిలో అన్నారు.

## 1) పరమత ఖండన వైఖరి

ఇప్పుడు ఆయా మతాలవారు చేసే యుక్తివాదం ఎటువంటిది? దాని నిరసనం ఏ విధంగా చేయబడింది? అనే విషయం సంగ్రహంగా ప్రస్తావించబడుతున్నది.

సాంఖ్యులు ఏమంటారు అంటే, లోక ప్రసిద్ధమైన చేతనం అచేతనం అనే రెండు విధాలయిన వస్తువులలో, చేతనులు అనాది అయినవారు కనుక, అచేతనాలే కార్యాలుగా కనిపిస్తున్నందున, వాటికే కారణాన్ని పలకాలి. సత్వాది గుణాలను కలిగినది జగత్తు. కారణం కూడా అటువంటిదే. ఈ విధంగా అనుమానంతో సిద్ధిస్తుంది, మూల ప్రకృతి. అందుచేత అది అనుమానిక మనబడుతుంది. ఇది ఉపాదాన కారణం. కర్త అనే నిమిత్త కారణం కావాలి కదా అంటే, పలుచోట్ల కర్త ఉండడం కనిపిస్తున్నా, అతడు సర్వత్ర ఉండి తీరాలనే నిర్బంధం

లేదు. పాలు తానే పెరుగుగా అవుతున్నది వాన నీరు తాటి కొబ్బరి మొదలైన కాయలలో పలు విధాలైన రసాలను కలిగినదిగా మారుతున్నది. పశువులు తినే గడ్డి మొదలైనవి పాలుగా మారుతున్నవి. అచేతనమంతా పరార్థమే కనుక, జీవులు అనుభవించడం కోసమే లోకం ఉద్భవిస్తున్నదని జీవాత్మలను మాత్రమే అంగీకరిస్తాము. ఈశ్వరుడు ఎందుకు జ్ఞానం పొందనంతవరకు సంసారులై ఉండి, దానిని పొందిన తరువాత జీవులు మోక్షాన్ని పొందుతున్నారు– అని సాంఖ్యులు అంటారు.

దీనికి బదులు ఏమంటే– రాయి, కొయ్య మొదలైనవి కర్తలు లేకపోతే ఇల్లు, బండి మొదలైనవిగా కావడం లేదు కనుక, ఆ విధంగా కర్త ఉన్నప్పుడే ఏర్పడడం వల్ల, కర్త కూడా కారణమని గమనిస్తున్నాము. కొన్నిచోట్ల కనిపించినా, వాటిని కారణాలుగా గ్రహించనక్కరలేదు అంటే, కర్త లేకుండానే ఇల్లు, బండి మొదలైనవి ఏర్పడాలి కదా. ఏ కార్యానికి కర్త కావాలి, దేనికి వద్దు –అని విచారించి నియమం చెప్పలేము. పాలు మొదలైన వానిలో కర్త లేడు కదా అంటే, అక్కడ కర్త లేడు– అని మేము అంగీకరించడం లేదు. ఇద్దరికీ సమ్మతమైన చోటు మాత్రమే దృష్టాంతం అవుతుంది. కర్త కనిపించని చోట అంతా కర్త ఉన్నాడని వాదించే మేము, వాటికి కూడా, లోకానికి వలె, కర్తగా ఈశ్వరుని స్థాపించినందున, వాటిని మీరు మీ పక్షంలో దృష్టాంతంగా ఉదాహరించలేరు.

అచేతన వ్యాపారం నడపడానికి నిలుపడానికి చేతనులు కావాలి. అక్కరలేదంటే, సృష్టిలో ప్రవర్తించిన మూల ప్రకృతిని ప్రవర్తించకుండా నిలిపేవారు ఎవ్వరు లేనందున, సదా సృష్టియే జరగాలి. ఇక ప్రళయం అనేదే ఉండదు. ఇక్కడ ఈశ్వరుడు ఎందుకోసం దానిని ప్రేరేపించాలి? సాలెవాడు, కుమ్మరి మొదలైన జీవుల వలే కాకుండా, తన ప్రయోజనం కోసం కాకుండా ఇతరుల మంచి కోసమే అంటే, అప్పుడు సుఖమయంగానే లోకం అంతా సృష్టింపబడాలి. వేరే విధంగా పలు రీతులలో సృష్టింపబడుతున్నందున, వైషమ్యం మొదలైన దోషాలు భగవంతునకు కలుగుతాయి. అందువల్ల, అతడు ఈశ్వరుడు కాడు– అని అంటారు, సాంఖ్యులు.

దీనికి సమాధానం ఏమంటే, జీవుల హితం కోసమే వారు చేసిన కర్మలను పోగొట్టడం కోసం, ఆ కర్మలకు తగిన ఫలాన్ని ఇస్తున్నాడు. కనుక, ఈశ్వరునకు దోషం సంక్రమించే అవకాశం లేదు. దయను కలవాడైతే, దండింప వలసినవారిని కూడా విడచి పెట్టాలని ఎవరూ అనరు. అటువంటి ప్రభువు ఒకడు ఉంటే, రాజ్యమే అల్లకల్లోలం అయిపోతుంది. రాజ్యపాలనలో అతను అసమర్థుడు అనే పేరును తెచ్చుకుంటాడు.

మంచితోనే అందరికీ బుద్ధి వచ్చేటట్లు ఈశ్వరుడు చేయవచ్చు కదా అని అంటే, ఆ విధంగా చేయడం తనకు సాధ్యమవుతుందనే సంగతిని పరమపదంలో భగవంతుడు చూపుతూనే ఉన్నాడు. అనాదిగా కర్మవశ్యులు నిండిన ఈ సంసారమనే దానిని బౌద్ధులు, జైనులు అనే అవైదిక మతస్థులతోపాటు అందరూ అంగీకరించారు. ఇక్కడ ఆ విధంగా అతడు చేస్తే, సత్కర్మ, దుష్కర్మలనే విభాగమే లేకుండా పోతుంది.

అయితే, కర్మల శక్తిని అనుసరించే ఈశ్వరుడు ప్రవర్తిస్తున్నట్లు అయితే, ఆ శక్తియే చాలు కదా! ఇక, ఈశ్వరునితో ఏమి ప్రసక్తి? అని సాంఖ్యులు ప్రశ్నించవచ్చు. దీనికి ఈశ్వరుని అంగీకరించిన వారు అందరూ చెప్పే బదులు ఏమంటే, కర్మ శక్తి అంటే జీవుల దగ్గర ఉండే పుణ్య పాపాలు. అవి అచేతనాలు కనుక, చేతనుని ప్రేరణ లేనిదే అవి ఫలించవు– అని పూర్వం పలికినదానిని స్మరించాలి. కర్మలకు లోబడి ఫలాన్ని ఇచ్చినందు వల్ల ఈశ్వరుని స్వాతంత్ర్యానికి భంగం లేదు. ఆ విధంగా కర్మలకు లోబడి ఉండడం సుజన సార్వభౌమ లక్షణమైన ఒక విధమైన స్వాతంత్ర్యమే. నమ్మాళ్వారులు కూడా " ఇన్ఱు ఎన్నై ప్పొరుళాక్కి తన్నై ఎన్నుళ్ వైత్తాన్, అన్ఱు ఎన్నై ప్పుఱమ్ పోగ పుణర్ త్తల్ లు ఎన్ శెయ్ వాన్?" (స్వామి ఈనాడు నన్ను ఒక వస్తువుగా చేసి, తన అధీనంగా చేసుకున్నాడు. మరి, ఆనాడు నన్ను బయటకు పోయేటట్లుగా ఎందుకు విడచి పెట్టినట్లు?) అని అంటూ ఈశ్వర స్వాతంత్యాన్ని స్థాపించారు. భగవద్రామానుజుల అభిప్రాయానుసారం ఇక్కడ ప్రశ్నకే అవకాశం లేదని గ్రహించాలి. పుణ్యం పాపం జీవధర్మమైన అదృష్టం. అపూర్వమనేది మీమాంసకులు చేసే కల్పన. దానిని మిగిలిన వారు కూడా అనుసరించారు ఇది శాస్త్రంలో ఎక్కడా దృష్టం కాదు గనుక అదృష్టమే, అపూర్వమే. శాస్త్ర వచనాలు స్పష్టంగా ఏమీ తెలియజేస్తున్నాయి అంటే యాగ హోమాది ఆయా కర్మలచే ఆరాధింపబడిన దేవత చేసే అనుగ్రహమే పుణ్యం సాధారణంగా తన ఆజ్ఞానుసారం నడచుకుంటున్నాందున ఈశ్వరుడు చేసే అనుగ్రహమే పుణ్యం ఆ విధంగా నడుచుకోకపోతే అతడు చూపే నిగ్రహమే పాపం. వస్తుస్థితి ఈ విధంగా ఉండగా, పుణ్య పాపాలు చాలు కదా ఇక ఈశ్వరునితో ఏమి పని అనే ప్రశ్న ఏ విధంగా వస్తుంది ఇది లౌకికరాజ ప్రజా న్యాయానికి కూడా సరిపోదు. ఆయా దేవతలు అనుగ్రహించడం కూడా భగవంతుని అనుగ్రహం వల్లనే అని గీత "యో యో యాం యాం తనుమ్" అని మొదలైన శ్లోకం ద్వారా వివరించింది. అళ్వార్లు కూడా " అవరవర్ ఇఱైయవర్ కుఱైవిలర్ ఇఱైయవర్, అవరవర్ విదివழி అడైయ నిన్ఱనరే" (ఆయా అధికారుల చేత ఆరాధింపబడే దైవాలు ఆయా అభీష్టాలను ఇవ్వడంలో ఏ కొరత లేనివారే. ఎందుకంటే, సర్వస్వామి అయిన శ్రీమన్నారాయణుడు ఆయా అధికారుల అదృష్టానుసారంగా ఫలం

కలిగేటట్లు ఆయా దేవతలకు అంతర్యామిగా నిలచి ఉన్నాడు) అని పలికి ఈశ్వరస్వాతంత్ర్యాన్ని కూడా అంగీకరించారు.

ఈ విధంగా ఈశ్వరుని అంగీకరించినప్పుడు, జీవులకు విరామం ఇవ్వాలని అతడు పగలు, రాత్రి అనే విభాగం వలే సృష్టి, ప్రళయం అనే విభాగాన్ని కూడా తాను స్థిరంగా ఏర్పరిచి, కర్మఫలం ఇవ్వడం కూడా దానికి తగినట్లు విభాగం చేశాడు. అందుచేత, ప్రళయం ఏర్పడుతున్నదని చెప్పవచ్చు. ఈశ్వరుని అంగీకరించకపోతే, ప్రకృతి అనే అచేతనం సృష్టిలో ప్రసక్తమై ఉన్నప్పుడు దానిని నిలిపే వారెవరు లేనందున, సదా సృష్టియే జరగడం సంభవిస్తుంది. అందువల్లనే నిరీశ్వర వాదులైన మీమాంసకులు సృష్టి ప్రళయాలను అంగీకరించకుండా, "పంచభూతమయమైన ఈ లోకం సదా ఈ రూపంలోనే ఉన్నదని, ఎత్తు, పల్లం, ఊరు, అరణ్యం అనే మార్పు మాత్రమే. భూమి, నీరు, అగ్ని, వాయువు అనేవి ఏవి నశించవు" అని అంటారు. యుక్తితో సృష్టి, ప్రళయాలను స్థాపించడానికి ప్రయత్నం చేసిన న్యాయాచార్యుడు ఉదయనుని వాదాన్ని శ్రీరామానుజులు శాస్త్రయోనిత్వధికరణంలో నిరసించారు. దానిని శ్రీదేశికులు న్యాయ పరిశుద్ధి అనే గ్రంథంలో విస్తృతంగా వివరించారు ఇక, సాంఖ్యులు సృష్టి ప్రళయాలను విడువకుండా వేదప్రామాణ్యాన్ని పలికితే నిరేశ్వరవాదం సిద్ధించదు.

ఇక అచేతనానికి చేతన సంసర్గం ఆవశ్యకమని అంగీకరిద్దాం. జీవ సన్నిధానమే చాలు కదా. గోవు కడుపులోని గడ్డి మొదలైనవి ఆహారం పాలుగా మారుతున్నది కదా! అని అంటే, గోవు కడుపులో వలె ఎద్దుకడుపులో పాలు ఎందుకు రావడం లేదు? జీవ సన్నిధానం అనేది అంతటా ఉంది కనుక, కింద జారి పడిన గడ్డి కూడా పాలుగా కావాలి కదా! అందుచేత వ్యాపించే జీవుడు కావాలి సన్నిధానం మాత్రం చాలదు. సాంఖ్యులు "జ్ఞాన హీనమైన ప్రకృతి కూడా చేతన సన్నిధానంలో కార్యం నిర్వహిస్తుంది. గుడ్డివాడు, చూపును కల కుంటివాని జ్ఞానంతోనే తాను దారిలో నడచి వెళ్లి, కుంటివానిని కూడా ఎత్తైన చోటుకు తీసుకొని పోతున్నాడు "అని అంటారు. ఈ ఉదాహరణ సరికాదు. అక్కడ, కుంటివాని వలె గుడ్డివాడు కంటితో చూడలేకపోయినా, జ్ఞానం కలవాడై, అతడు చెప్పిన దానిని విని తెలుసుకొని, అతడు ఇచ్చిన కర్ర చూపే దిక్కును గ్రహించి, నడుస్తాడు. కనుక, అతడు ప్రకృతి వలె జడం కాదు. కుంటివాడు కూడా నిర్వికార సాంఖ్య చేతనులవలె కాకుండా, క్రియాశీలుడే. అయస్కాంతం ఇనుములో క్రియకు కారణం అవుతున్నది కదా! అని అంటే, అక్కడ, " ఇంత దగ్గర ఉన్నప్పుడు అయస్కాంతం కారణం అవుతున్నది" అనే ఒక వ్యవస్థ

ఉన్నది. ఆ వ్యవస్థను కలిగించడానికి ఈశ్వరుడు కావాలి. జీవులు ఎల్లప్పుడూ ప్రకృతికి దగ్గరగానే ఉన్నందున, ఎల్లప్పుడూ సృష్టి వ్యాపారం కొనసాగాలి. నిజానికి సృష్టియే జరుగదు. ఎందుకంటే, సత్వం, రజస్సు, తమస్సు అనే గుణాల సమస్థితిలో ప్రళయం, హెచ్చుతగ్గులనే విషమస్థితిలోనే సృష్టి అని అంటారు. సమస్థితిలో పరిణమించే ప్రకృతిలో తటాలున విషమస్థితి ఏవిధంగా కలుగుతుంది? దానికి ఏమి వ్యవస్థ? ఇంతే కాక, వీరు జీవులను ఎందుకు అంగీకరించాలి? అచేతనం పరార్థం అయినందున, ఫలాన్ని అనుభవించడానికి చేతనులు కావాలి కదా! అని అంటే, జీవులకు ఏమి ఫలం? భోగం, మోక్షం అని అంటే, కర్తకు కదా ఫలం చెందుతుంది. జీవులకు కర్తృత్వమే లేదు కదా. ధర్మాధర్మాలను, కర్తృత్వాన్ని ప్రకృతి పరిణామమైన బుద్ధిలో అంగీకరించిన వీరు, భోగమోక్షరూపాలైన ఫలాలను కూడా అక్కడే గ్రహించాలి. ఈ విధంగా బుద్ధి అనే అచేతనమే చేతనం. దీనివల్ల, దేహాత్మవాది అయిన చార్వాకునకు అన్నగారే సాంఖ్యుడు. ఇతడు కూడా ప్రకృతి పరిణామమైన బుద్ధికే ధర్మాధర్మాలను అంగీకరిస్తున్నాడు కదా. ఇంతే కాక, నిర్వికారమైన జీవాత్మలకు భోగం మోక్షం అనే వికారాలు ఎక్కడ ఇంకా విచారించడం ఆరంభిస్తే, సాంఖ్య మతంలో మొత్తం ముందుమాటకు వెనుక మాట వ్యతిరేకంగా ఉండే మాటలే. జీవులు నిత్యముత్తులనే విభాగం కలవారై, సంసారంలో ఉండేవారు, తరువాత, తత్వ జ్ఞానం వల్ల ముక్తిని పొందుతారు– అని పలికి, "న విద్యతే నాపి ముచ్యతే పురుషః" అని అంటారు. తనకు ఏ విధమైన ఫలాన్ని ఎదురు చూడకుండా జీవుల కోసమే పాటు పడే ప్రకృతికి సాటి వచ్చే పరోపకారి లోకంలో ఉన్నదా! అని ప్రకృతి చాలా తెలివిని కలవస్తువుగా పలుకుతారు. వేదం ప్రమాణమని అంటూ, వేదం విధించిన కర్మలలో జీవహింస ఉంది కనుక అశుద్ధియే అని వాటిలో దోషాన్ని పలికి, తాము పలికినట్లుగా తత్వ జ్ఞానాన్ని పొందినవాడు వెంటనే మోక్షాన్ని పొందుతాడు, ఆ విధంగా పొందడం కల్పించడం లేదే! అని అనవద్దు, జ్ఞానాన్ని పొందగానే జీవుడు ముక్తుడవుతాడు. తిప్పబడిన చక్రం వెనుకకు కూడా తిరిగేటట్లు, శరీరం ఇంకా ఉన్నా ముక్తుడే" అని అంటారు. ఈ విధంగా వీరు పలికే పలు విధాలైన పరస్పర వ్యాఘాత వచనాలను గమనించవచ్చు. ఇంచుమించుగా వీరు చూపిన దారిలోనే సాగే అద్వైతులు జగత్తు మిథ్య అనే బౌద్ధ మతాన్ని అనుసరించి, జగత్తులో ఒకే ఆత్మ అని అన్నందున, అద్వైత మతంలో, సాంఖ్యమతంలో పలికిన దోషాల కంటే ఇంకా ఎక్కువ దోషాలు సంక్రమిస్తాయని శ్రీరామానుజులు చివరలో పలికారు. యుక్తి వాదాలను యుక్తి వాదంతోనే నిరసించే ఈ పాదంలో ఈ అధికరణంలో యుక్తితో ఈశ్వరుని స్థాపించే బాదరాయణులు ముందుగా శాస్త్రయోనిత్వాధికరణంలో ఈశ్వరుని యుక్తితో

స్థాపించలేము అని అన్నారే! ఈ రెండు పరస్పరవిరుద్ధాలు కదా! అని అంటే, అక్కడ యుక్తితో ఈశ్వరుని స్థాపించడం వీలు కాదని అన్నారు ఇక్కడ "ఈశ్వరుడు లేడు" అని యుక్తితో స్థాపించడం వీలు కాదని అంటున్నారు. జ్ఞానం కలవాడు కావాలి అని అన్నందున, ఈశ్వరుడే అతడు అని అన్నట్లు కాదు. అతడు ఈశ్వరుడు కావచ్చు అంటే, అతనిని అనుమానం బాధించదు. (అధికరణ సారావళి– 180). కార్యకరణాలు విలక్షణంగా కనిపిస్తున్నందున అచేతనమే ఉపాదానమని కూడా కాదు. సత్వం, రజస్సు, తమస్సులు మూడు ద్రవ్యాలని పలికి, ప్రకృతి నిరవయవమైన ఒకే ద్రవ్యమని అనడం కూడా సరికాదు.

గడచిన పాదంలో వలె ఇక్కడ కూడా యోగాన్ని ఎందుకు నిరసించలేదు? అని అంటే, చివరి సూత్రంలోను, దానికి ముందు సాంఖ్యమతానికి పలికిన నిరసనమే యోగమతానికి కూడా చెప్పినట్లు అవుతుంది ఏ విధంగా అంటే సాంఖ్యుల వలె యోగులు కూడా సకరాత్మలు నిర్వికారాలు ప్రకృతిలోనే కర్తృత్వాది సకల వ్యాపారాలు అని అంటే, ఈశ్వరుడు అనే ఆత్మకు నేరుగా జగ ద్వ్యాపారాలు లేవని, ప్రకృతిలోనే అవి ఉన్నాయని, ప్రకృతిలో జీవ ప్రతిబింబంవలె ఈశ్వరునకు ప్రతిబింబం ఉన్నందున, ప్రకృతిలోని వ్యాపారాలు ఈశ్వరునిలో ఏర్పడుతున్నాయని చెప్పవలసి వచ్చింది. వ్యాపారం ఏమీ లేనివాడు ఏ విధంగా ఈశ్వరుడై నిమిత్త కారణం అవుతాడు ప్రకృతి వ్యాపారాలు ఆరోపింపబడినందున ఈశ్వరుడు అనబడుతున్నాడు అని అంటే ప్రకృతి ధర్మమైన ఉపాదానద్రవ్యం కూడా ఆరోపింపబడి ఈశ్వరుడు ఉపాదానం కావచ్చు. క్లేశ కర్మ విపాక ఆశయాలు నశించినందున జీవ విలక్షణుడు ఈశ్వరుడు అని అంటారు. జీవుల కంటే అధికభ్రాంతిని కలవాడై ఉన్నందున, అధమ జీవుడు కావలసి ఉండగా ఈశ్వరుడవుతాడా? " ఈశ్వరప్రణిధానాద్వా" అని ఇతనిని ఎందుకు ధ్యానం చేయడం అని ఈ విధంగా ప్రతిషేధాలను విచారించగా, భగవదవతారమైన కపిలుని మతమే నిరసింపబడేటప్పుడు, ఇక, హిరణ్యగర్భమతమైన యోగం ఏ విధంగా నిలువ గలదు ? పురాణాదులలో కపిలుడు నారాయణుడని, ఆయన ఉపదేశించిన మతం సేశ్వర సాంఖ్యం అని స్పష్టంగా ఉండగా, ఆయన మతం నిరీశ్వర సాంఖ్యమని బాధరాయణుడు నిరసించడం న్యాయమా? అని అనవచ్చు. భారతంలో సాంఖ్యాదులను సర్వాత్మనా దూషించకూడదనియే వ్యాసాధులు సాంఖ్యమతం పలికినది కపిలుడు అని పలికి అంతరాత్మ అయిన పురుషుని అతడు పలుక లేదు అని తెలిపారు అంటే దేవహూతి మొదలైనవారు శాస్త్రాన్ని గురించి తెలియాలని అనుకున్నప్పుడు శాస్త్రానుసారంగా అన్నిటిని ఉపదేశించారు. తర్కమూలంగా శాస్త్రస్థాపనాన్ని అంగీకరించిన కొందరు శిష్యులకు శాస్త్రార్థాన్ని చెప్పకుండానే, తర్కమూలంగా 25 తత్వాలను

ఉపదేశించారు. శాస్త్ర యోనిత్వాధికరణానుసారం ఈశ్వరుని తర్కంతో స్థాపించలేము కనుక, అతనిని విడచి పెట్టారు. తానే ఈశ్వరుడైనందున ఉపదేశ కాలంలో ఈశ్వర ప్రణామాన్ని చేసి, ఉపదేశం చాలు అనే భావించి కూడా విడచి పెట్టారు. ఈశ్వరుడు లేడా? అని శిష్యులు అడిగి ఉండవచ్చు. వాస్తవానికి తానే ఈశ్వరుడు అయినందున, " నాకంటే ఈశ్వరుడు ఎవరు?" అనేది ఈయన సమాధానం. దీని అర్థాన్ని సరిగా తెలియలేక, జీవునకు మించిన ఈశ్వరుడనేవాడు లేడని వారు అభిప్రాయపడ్డారు. ఈ విధంగా ఛాందోగ్యంలోని ప్రజాపతి వాక్యంలో జీవుని ఉపదేశించిన ప్రజాపతి వద్ద ఇంద్రుడు ఈశ్వరుని తెలియలేనట్లుగా, వీరు కూడా ఈశ్వరోపదేశన్ని పొందకుండా పోయారు. తరువాత ఇది నిరీశ్వరవాదంగా వృద్ధి చెందింది.

## 2) కణాదమహర్షిమత నిరసనమ్

ఇక, వైశేషికం (తార్కిక మతం) నిరసింపబడుతున్నది. అన్నీ నిత్యమని సాంఖ్యులు అంటే, కొన్ని తత్వాలు నిత్యమని తార్కికులు అంటారు అన్నీ అనిత్యాలనే బౌద్ధుల నిరాసం దీని తరువాత చేయబడుతుంది. తార్కిక పక్షంలో యుక్తివాదం పెరిగి వృద్ధి చెందింది. వీరు ఉపనిషత్తులను మరచి తత్వ విచారణ చేశారు ప్రకృతి, మహాన్, అహంకారంవంటి సాంఖ్యవాదం వీరికి రుచించలేదు. వీరి వాదం ఏమంటే జ్ఞానం కలవాని సహాయం లేకుండా అచేతన వస్తువులు కార్యాన్ని చేయలేవు –అనే వాదాన్ని అంగీకరిస్తాము. అయితే, ఒక ప్రకృతి అనే ద్రవ్యం మొత్తం లోకానికి కారణం అని అనడం తగదు. వృక్షం నుండి ఆకులు, పువ్వులు, కాయలు మొదలైన వానివలె, పర్వతంనుండి మన్ను, రాళ్లు, చెట్లు మొదలైనవానివలె, ప్రకృతినుండి పంచభూత ప్రపంచం పుడుతున్నది. అంటే, ప్రకృతి స్థూలమై సావయవం అవుతున్నది సూక్ష్మమైనది స్థూలమవుతున్నది. అంటే, పలు బాహ్య వస్తువుల కలయిక వల్ల ఏర్పడుతుంది. లోకంలో విత్తనాలు పలు వస్తువుల చేరిక వల్ల స్థూలమవుతున్నవి. ఒక్కొక్క చిన్న ప్రాణి పరువంనుండి పెరిగి పెద్దది అవుతున్నది. వర్షజలం కొంచెం కొంచెంగా, బొట్టు బొట్టుగా పడి చేరి, నదిగా, సముద్రంగా అవుతున్నది. పలు అవయవాల ద్వారా అవయవి ఏర్పడడం అనే దీనివల్ల వ్యక్తం అవుతున్నది. ఇక విభజించడానికి వీలు కాదు అనే రీతిలో చివరిగా నిలచిన అవయవాలు పరమాణువులు. అవి అనాది. నిత్యాలు. అవి నాలుగు విధాలు. పృథివి, జలం తేజస్సు, వాయువు అనేవి. ఆయా జాతి పరమాణువులు రెండు చేరితే ఏర్పడేది ద్వ్యణుకం. ఈ విధంగా త్ర్యణుకాదులను పైపైకి భావించాలి. అవయవాలు అవయవిని పుట్టించిన తరువాత, అవయవాలలో ఉండే గుణాలు అవయవిలో కూడా గుణాలను కలిగిస్తాయి. అందువల్ల అన్ని సగుణాలై, పృథ్వి,

జలం అని ఈ విధంగా వేరువేరుగా తెలియబడతాయి. ఈ నాలుగు భూతాల వలె ఆకాశం మొదలైన నిత్యద్రవ్యాలు వేరుగా ఐదు ఉన్నాయి. ఈ విధంగా 9 రీతులను కలిగిన ద్రవ్యం, గుణాలు ఆరు కలిపి ఏడు పదార్థాలు– అని వీరి మతం. దీనిని దూషిస్తున్నారు.

మొదటి సూత్రంలో హ్రస్వపరి మండల నుండి మహోద్దీర్ఘాలు అనే రీతిలో ఉన్నది, వీరి వాదమని అంటున్నారు. మాటల వైఖరిలోనే అన్నీ అసమంజసమని తెలుస్తుంది. ముందు సూత్రం నుండి అసమంజస పదాన్ని కలుపుకున్నప్పుడు అది స్పష్టమవుతుంది. మహదీర్ఘమని, మహత్తుగా దీర్ఘంగా ఉండే వస్తువును తెలుపుతున్నారు. దీనిని త్ర్యణుక మని, త్రసరేణువు అని తార్కికులు అంటారు. హ్రస్వపదంతో ద్వ్యణుకం చెప్పబడుతుంది. పరిమండలం అనే పదం వారి మతంలో పరమాణు పరిమాణంలోనూ పరమాణువులు వ్యవహరింపబడుతుంది నిత్యం పరిమండలం అనేది వారి సూత్రం పరమాణువును, ద్వ్యణుకాన్ని అనుహస్వమని అంటారు. పరమాణు పరమహరస్వం మొదట ఉండేది దాని నుండి అనుగ్రత్వం ఆ తర్వాత కొట్టేది అంతా మహత్తు దీర్ఘం అవుతుంది ఒక పరిమాణం ఇంకొక పరిమాణం పుడుతున్నది అంటే అది కారణ పరిమాణానికి తగినది, ఉత్కృష్టమైనది గా ఉంటుందని అంటారు. అయితే, ఏమిటి త్ర్యణుకంనుండి మహత్తర మహత్తమ పరిమాణాలు వస్తున్నవి ఈ విధంగా ఉండగా పరమాణువు నుండి పుట్టే ద్వ్యణుకంలో పరమాణు పరిమాణం పరిమాణాన్ని పుట్టిస్తే అది అణువైనందున తరువాత అనుతరం కావాలి ఆ విధంగా అణుతరం కానందున పరమాణు పరిమాణం కారణము కాదు. ద్వ్యణుక పరిమాణం నుండి త్ర్యణుక పరిమాణం పుడితే, అది కూడా అణువై ఉత్కృష్టమై ఉంటుంది ఆ విధంగా లేక మహత్తుగా దీర్ఘంగా ఉన్నందున ద్వ్యక పరిమాణం కూడా కారణం కాదని అంటారు. లోకంలో అవయవ పరిమాణమూలంగా అవయవిలో పరిణామం కలుగుతుండగా దాని ప్రకా రం కల్పించిన పరమాణువు ద్వ్యణుకాల పరిమాణానికి ఆ స్వభావాన్ని అంగీకరించకపోవడం ఒక అసమంజసం. ఈ విధంగా అయితే త్ర్యణుకంకంటే ద్వ్యకం చిన్నదిగా ఉండవలసి ఉండడం ఎందుకు?

సూత్రంలో మహా దీర్ఘం అనేదానికి మహత్పరిమాణం, దీర్ఘ పరిమాణం అని ద్వంద్వంగా గ్రహించి అర్థం పలికితే, శబ్దం సాధువు అవుతుంది. ఈ పరిమాణాలకు కార్య కారణ భావం వారు అంగీకరించనందున ఆ అర్థం కుదరదు మహత్తు అయిన దీర్ఘమని తత్పురుషనుగ్రహిస్తే మహదీర్ఘమ వుతోంది ఆ విధంగా మహదీర్ఘం అంటే, ద్రవ్యం యొక్క దైర్ఘ్యం, అంటే, పొడుగు, మహత్తు అని అర్థం. అందుచేత ఆ విధంగా ప్రయోగించలేదు

మహత్తుగా దీర్ఘంగా ఉండేది త్ర్యణుకం. అది ద్వ్యణుకం నుండి పుడుతుంది. ఆ విధంగా ఉండగా హస్వం పరిమండలం అనే రెండిటి నుండి త్ర్యణుకం పుడుతుంది అని పలకడం కుదురుతుందా? అని అంటే మూడు ద్రవ్యాలు ఉన్నాయనేది మాత్రం తెలుపడంలోనే దీని దృష్టి. త్ర్యణుకానికి ద్వ్యణుకం సాక్షాత్తు కారణం. పరిమండలం పరంపరయా కారణం అని భావించి, " హ్రస్వపరిమండలభ్యామ్" అని అన్నారు తప్ప, యథాసంఖ్యంగా గ్రహించి, హ్రస్వం నుండి మహత్తు, పరిమండలం నుండి దీర్ఘం పుడుతుందని ఒకడు కల్పిస్తే, అది అసమాన్య సం అని మీరు భావించేటట్లే మీరు పరమాణువు నుండి ద్వ్యణుకం, దాని నుండి త్ర్యణుకం అని అనడం కూడా అసమంజసమే– అని తెలుపబడినట్లే. లోకంలో చిన్న ఆవగింజ పెద్ద ఆవగింజ మిరియం అనే విధంగా ఉండే వస్తువులలో ఒక్కొక్కటి కొన్నిటి కంటే అణువుగా, కొన్నిటికంటే పెద్దదిగా చెప్పబడగా, త్రసరేణువునుండి అన్నీ పెద్దవి, దీర్ఘమైనవి అని, దానికి పూర్వం కొన్నిటిని కల్పించి, అవి అణువులే అని విభాగించి పలకడం కూడా తగదని దీనివల్ల తెలుపబడింది.

కంటికి కనిపించే త్రసరేణువులను ఎందుకు సావయవాలుగా గ్రహించాలి? అవి ఒకదానితో ఒకటి చేరినప్పుడు ఒకవైపు చేరుతూ ఇంకొక పక్క చేరకుండా ఉండడం వల్లనే కదా మహత్తరమైన వస్తువు పుడుతుంది అందువల్ల అది సావయవం ఆ అవయవాలు ఒక్కొక్క అంశానికి చేరాలని పరమాణువును గ్రహిస్తాము అని అంటే అదే న్యాయంలో పరమాణువులకు ఒకదానితో ఇంకొక దాని చేరిక ఒక్కొక్క అంశంలో మాత్రమే అని ఇంకా ఇంకా అవయవ కల్పన చేయడం వల్ల అనవస్థ ఏర్పడుతుంది. అందువల్ల పరమాణువులను కల్పించకూడదు అంశ లేకుండా పరమాణువులు చేరితే మొత్తం కలిస్తే ఎన్ని పరమాణువులు చేరిన ఒకే పరమాణువు యొక్క పరిమితిలోనే పరిమాణం ఉంటుంది.

ఇక, సంకోచమనేది నిరవయవమైన వస్తువులో అంశం లేకపోయినా, మొత్తం ఉండదు అనేది దాని స్వభావం –అని అంటే, అప్పుడు త్రసరేణువులోనే నిలువవచ్చును కనుక, ద్వ్యణుక పరమాణువుల నుండి అది పుడుతుంది అనేది అసమంజసం అవుతుంది. అది మహత్తు అవుతుంది కదా అని అంటే, అది అణువు అని అంటే ఏమి? అణువుకు ప్రత్యక్షం ఉన్నదని అనవచ్చు కదా సువర్ణ విగ్రహాది విషయమైన శాస్త్రంలో తసరేణువు కుపైన పరమాణువు ఉన్నదని చెప్పబడింది అంటే, ఆ విధంగానే లోకానికి కారణం మూల ప్రకృతి అని పలు పలు శాస్త్రాలలో స్పష్టంగా ఉన్నందున పరమాణు కారణవాదం నిలువదు పలు పలు పరుమా పరమాణువులు మండలంగాను, దీర్ఘంగాను చేరి పలు కార్యాలు జరగవచ్చు

కనుక ద్వ్యణుకం, త్ర్యణకం అనే ఈ నిబంధన కూడా తగదు. దీనికి మించిన విశేషాలను దేశికుల సూక్తులలో గమనించాలి. ఈ విధంగా పలు విషయాలను ఇందులో చేర్చుకోవాలి. అణుకారణవాదంలోని దోషాలు ఇటువంటివి.

దీనికి తరువాత, అవయవిద్రవ్యాలను క్రమక్రమంగా కల్పించడం, మొత్తం తొమ్మిది ద్రవ్యాలు అని అనడం, వానికి గుణకల్పన చేయడం, మొత్తం 24 గుణాలు అని అనడం, కర్మమనే తత్త్వం ఉన్నదని అన్నా, అందులో ఉత్క్షేపణాది ఐదు కర్మలను పల్కడం, సామాన్య, విశేష, సమవాయ, అభావాలు అనే నాలుగు పదార్థాలను పలకడం, అంతా కుందేటి కొమ్మువంటిది. దీనిని చూచి కోపించి శూన్యవాది "ఏమీ లేదు "అని అన్నాడు కాబోలు. తర్కం ఒక్కటే సత్యం, కుతర్కాలు అనేకం కనుక, పలు తత్త్వాభాసాలు ఈ విధంగా తోచాయి.

అంతేకాక పరమాణువులు కలవడానికి వానిలో క్రియ జనించడం మొట్టమొదట దేనివల్ల? అదృష్టం వల్ల అని అంటే, . అదృష్టాలు ఎప్పుడు ఉంటాయి కనుక, ప్రళయం ఇక ఏ విధంగా సంభవిస్తుంది? ఈశ్వర సంకల్పం వల్ల సంభవిస్తుంది అని అంటే, ఈశ్వరుడు ఉన్నాడని ఏ విధంగా తెలుస్తుంది? అనుమానం వల్ల అని అంటే, అది ఇంతకుముందే దూషింపబడింది కదా. శాస్త్రం వల్ల అని అంటే, శాస్త్రాన్ని ప్రమాణంగా గ్రహిస్తే పరమాణు కారణావాదం వీగిపోతుంది. ఈశ్వరుడు లేకుండా సృష్టి ప్రళయ స్థాపనం చేయలేమని ఇంతకుముందే తెలిపాము. ఇంకా ఇంకా పరమాణువులను కల్పించి అనవ స్థతో, అమావాయ సంబంధంలోకూడా సంబంధ కల్పనాపరంపరయచ, అనవస్థయే సిద్ధిస్తుంది. ఘటం అనిత్యం, దాని రంగు మొదలైన గుణాలు అనిత్యాలు, ఆ రెండిటి సంబంధం సమవాయం నిత్యమని అనుభవ విరుద్ధంగా పలకడం కూడా గమనించాలి.

## 3) బౌద్ధమతఖడనం

వైశేషికం వైదికమనే పేరు పొందినా, సాంఖ్యంవలె వైదికతత్త్వాలను అంగీకరించనందున మహాభారతంలో ఇది పరిగ్రహింపబడలేదు. అందువల్ల, ఇది వేద బాహ్యతుల్యమే అని చివరిగా పలికి, తరువాత వేద బాహ్య మత ఖండనాన్ని ఆరంభిస్తున్నారు, సూత్రకారులు. సాంఖ్యం వలే ప్రకృతి మహత్తు అహంకారం మొదలైన తత్త్వాలను అంగీకరించిన సేశ్వరమైన పాశుపతాన్ని తరువాత ఖండించదగినదిగా ఇష్టపడకుండా, జైనమతానికి అనంతరమే దానికి చోటిచ్చారు. వైశేషిక మతాన్ని ఔలూక్యమతమని కూడా అంటారు. ఉలుకమంటే గుడ్లగూబ పరమశివుడు గుడ్లగూబగా

మారి, కణాదమహర్షికి వైశేషికమతోపదేశాన్ని చేశాడని వారి సంప్రదాయం అందువల్ల కణాధ మతానికి తరువాత పాశుపతాన్ని చేర్చి ఉండవచ్చు. సేశ్వరవాదం రెండిటిలోనూ ఉన్నది. అయితే పాశుపతాన్ని చాలా ఆభాసమతంగా గ్రహించి, తర్కమతం వలె పరమాణు కారణావాది కావడమే కారణంగా చేసుకొని, తరువాత బౌద్ధ మతాన్ని దూషిస్తున్నారు అందువల్లనే శూన్యవాదాన్ని మొదట ప్రస్తావించకుండా పరమాణువులను అంగీకరించిన బౌద్ధులను ముందు పలకడం జరిగింది. తార్కికులు నిత్య పరమాణువులను అంగీకరించగా, వీరు పరమాణువులు కూడా అనిత్యాలు అని అన్నారు. తార్కికులు కొన్నిటికే వినాశనం అంగీకరించినందున వారు అర్ధవైనాశికులు. అన్నీ ప్రతిక్షణం నశిస్తాయని చెప్పే ఈ బౌద్ధులు పూర్ణ వైనాసికులు ఏ వస్తువు అయినా అది పుట్టే క్షణానికి మరుక్షణం అది నశిస్తుంది తరువాత క్షణంలో దాని వంటి ఇంకొక వస్తువు పుడుతుంది దీపక్వాల వలె అవివేకం వల్ల ఒకటిగా భావింపబడుతున్నది ఒకటే దీర్ఘంగా కొనసాగుతున్నదంటే ఏమి? ఇంట్లో చాలా కాలం పెట్టబడిన విత్తనం పొలంలో నాటబడినప్పుడు మొలకెత్తుతున్నది ఇంటిలో ఎందుకు మొలవడం లేదు అది వేరు ఇది వేరు. ఇంటిలోని విత్తనం మొలవడానికి కారణం కాదు. పొలంలోని విత్తనం మొలిచే శక్తిని కలిగినది అటువంటి విత్తనానికి దానికి ముందు క్షణంలో ఉండే విత్తనం కారణం దానికి ముందు క్షణంలో ఉండే విత్తనం కారణం అవి ఒకదానితో ఇంకొకటి పోలి ఉన్నందున నాశం తెలియడం లేదు కనుక, ఒకటే అనే భ్రమ కలుగుతున్నది. ఆ విధంగానే శరీరం ఘటం మొదలైనవి అన్నీ క్షణికాలే. కర్రచే కొట్టబడినప్పుడు కుండ పగిలి పెంకులుగా అవుతుంది. ఈ విధంగా రూపు మారిపోయే నాసానికి దండం మొదలైన కారణాలు కావాలి ఒకే విత్తనంగా పరంపర కొనసాగినప్పుడు ఏ కారణం లేకుండానే నాశనం తానే వస్తుంది. కార్యం పుట్టడానికి కారణాలు ఒకదానికొకటి సహాయంగా అనేకం కావాలని ఇప్పుడు కల్పించనక్కరలేదు దానిని పొందించే శక్తిని కలిగిన ఆయా క్షణాలే కారణం కనుక, అవి లేనప్పుడు కార్యం లేదు. అవి ఉన్నప్పుడు వేరొకటి ఉండవలసిన పనిలేదు అని అంటారు. దీనిని నిరసించే అందరూ, "అదే ఇది" అని పలుమార్లు అనువర్తిస్తున్నట్లుగా వస్తువులు అనుభవంలో ఉండగా, ఈ ప్రత్యక్ష విరుద్ధమైన యుక్తి కుయుక్తియే కాగలదు విత్తనం ఇంటిలో మొలవకపోవడం అక్కడ నీరు మన్ను మొదలైనవి కలవకపోవడం ఇంటి నుండి పొలానికి వెళ్ళినప్పుడు ఎన్ని క్షణాలు మధ్యలో ఉన్నాయో అన్ని క్షణాలు ఇంటిలో విత్తనాన్ని ఉంచితే అక్కడ మొలిచినట్లు ఇక్కడ కూడా ఆ శక్తిని కలిగిన విత్తనం మొలవవచ్చు కదా. అప్పుడు మరి ఎందుకు విత్తనం ఇంటిలో మొలవడం లేదు ఇందువల్ల సహాయంగా ఉండే కారణాలు లేనందు వల్లనే మొలవలేదు అనేది తగిన సమాధానం.

ఇంతే కాక అన్నీ క్షణికం అనే పక్షంలో, పలు అవయవాలు కలిసిన తరువాత పుట్టవలసిన కార్యం ఎక్కడా పుట్టదు పరమాణువైనా సరే, వేరొకటి అయినా సరే, ఒకదానితో ఇంకొకటి కలవాలి. అవి చేరడానికి కారణంగా అవయవాలలో క్రియ పుట్టాలి. క్షణిక వాదంలో అవయవాలు పుట్టగానే నశిస్తాయి కదా అందువల్ల వాటికి ద్వితీయ క్షణం అనేది ఉండే అవకాశం లేదు ఇక క్రియ ఎక్కడ పడుతుంది క్రియకు మరుక్షణంలో ఆ అవయవాలు లేవు కదా వాటిలో కలయిక అనే సంయోగం ఏ విధంగా కలుగుతుంది అందుచేత భూతోత్పత్తికి అవకాశమే లేదు భౌతికాలు కూడా పుట్టవు ఈ అవయవం చలనాన్ని పొంది కదిలి వేరొక చోట అవయవంతో కలుస్తుందని చెప్పే అవకాశం లేదు అంతేకాక మానవుడు ఒక వస్తువును చూచి ఆశపడి దానిని గ్రహించాలని కోరి ప్రయత్నించి గ్రహిస్తున్నందున వస్తువులు చేరుతున్నాయి మానవుడు క్షణికం కనుక వస్తువును చూడడానికి ముందే అతడు నశిస్తున్నాడు చూచేవాడు వేరు ఆశపడేవాడు వేరు ప్రయత్నించేవాడు వేరు అని అనాలి చూచేవాడు నశిస్తే ఇక ఎవడు ప్రయత్నం చేస్తాడు అదేవిధంగా చూసిన వస్తువు కూడా నశిస్తున్నది కదా ఏది గ్రహింపబడుతున్నది?

కొందరు ఏమంటారు అంటే, అన్ని క్షణకాలు అయినా, అవిద్య వల్ల అన్ని స్థిరమనే విపరీత బుద్ధి వల్ల రాగద్వేషాలు ఏర్పడి అన్ని ఏర్పడతాయి మీరు పలు కారణాలు సహాయపడుతున్నందున కార్యం పుడుతున్నది అని అంగీకరించడం లేదే క్షణికమైన వస్తువు ఒక్కడే కదా కారణం దానికి అవిద్యాదులు ఏ విధంగా సహాయపడతాయి? మానవులకు విపరీత బుద్ధి కలిగిన వస్తువు నశించిన తరువాత చేరిక అనేది ఎక్కడ ?చూసిన వాడు నశించిన తరువాత ఎవడు గ్రహిస్తాడు? ఇంతే కాక, క్షణిక వాదంలో ముందు వస్తువు, తరువాత వస్తువు పుట్టేటప్పుడు దానికి ఆధారం కావడం లేదు. అది ఏవిధంగా కారణం ముందు క్షణంలో ఉంటే చాలు కారణం కావచ్చు కదా! అని అంటే, ముందు క్షణంలో ఎక్కడో ఎన్నో వస్తువులు ఉన్నాయి. అన్నీ కారణమా ?దేనిలో జనింప చేసే శక్తి ఉన్నది? దేనిలో ఉన్నదో ఏవిధంగా తెలుసుకోవడం? ఆయా దేశాలలో ఉండడం దానికి కారణం అంటే, దేశాన్ని సహాయంగా అంగీకరిస్తున్నారు కదా! మరి, స్థిరంగా దేశం అనే ఒక వస్తువు ఉన్నదా?

ఇంతే కాక, క్షణిక వాదంలో కారణం అక్కరలేదు అని, సహకారి కారణంగా ఏదీ లేదు అని మీరు చెప్పడం విరుద్ధం. ప్రత్యక్ష జ్ఞానం కలగడానికి నాలుగు కారణాలు కావాలి. అవి ఏవి అంటే, ఇంద్రియం, వెలుతురు, విషయం, ముందు క్షణంలోని జ్ఞానం –అని

అంటున్నారు కదా. ప్రత్యక్షమనే జ్ఞానం వర్తమాన వస్తువును గ్రహిస్తున్నది కనుక, పూర్వ క్షణంలో వలె, జ్ఞానం కలిగేటప్పుడు కూడా ఉండాలి. నాలుగు కారణాలు కలవాలి– అని అన్న తరువాత, సహాయం ఏమీ అక్కరలేదు– అని అనవచ్చునా?

ఇంతే కాక సజాతీయ సంతతి కలిగేటట్టుగా ఘటం ప్రతిక్షణం నాశనం పొందుతున్నది. ఇది అప్రతిసంఖ్యావిరోధం. దండం చేత కొట్టబడిన ఘటం నష్టమవుతున్నది. అక్కడ విజాతీయమైన పెంకు పుడుతున్నది. ఆ నాశం ప్రతిసంఖ్యా విరోధం అని అంటున్నారే! వీటిలో, ప్రతిక్షణం నాశనం అనేది అనుభవ విరుద్ధం. రెండవది అయిన, ఘటనాశానికి దండం కారణం అనదికూడా కుదరదు. ఘటం ఒక్కటే కారణం, సహకారి అయిన కారణం అక్కరలేదు– అని కదా మీ వాదం. ఏ ద్రవ్యానికీ నాశం లేదు– అనే మా పక్షంలో ఘటనాశమంటే, ఘటం కపాలంగా మారడమే.

కనిపించని నాశాన్ని అంగీకరించినవారు కనిపించనందున ఆకాశం అనేది లేదు అని అనవచ్చునా అంతేకాక ఇక్కడ పక్షి ఎగురుతున్నది అనే విధంగా కలిగే జ్ఞానంలో ఆకాశం ఆధారంగా విషయం అవుతున్నది శూన్యవాది వలే కాకుండా బాహ్య వస్తువులను క్షణిక సంతతిగా అంగీకరించిన బౌద్ధుడు ఆకాశాన్ని కూడా ఆ విధంగా అంగీకరించడం తగినది వాస్తవానికి ఏది క్షణికం కాదు ఒకే వస్తువు చాలాకాలం ఉండడం ప్రత్యక్ష సిద్ధమై ఉన్నది కదా కారణం లేకుండా నా సంకల్గితే మిగిలిన కార్యాలు కూడా కారణం లేకుండానే కలుగవచ్చును కనుక ఎవరూ దేనికోసం ప్రయత్నించనక్కరలేదు ప్రయత్నం చేసేవాడు ఆశిస్తున్నందున ఫలాన్ని పొందేవాడు ప్రయత్నం చేయనివాడు అవుతున్నాడు అప్పుడు ఎవరూ ప్రయత్నించరు ఈ అంతా వైభాషిక సౌత్రాంతిక మతాల దూషణం.

ఇందులో ప్రత్యక్షానికి విషయం ఏ విధంగా కారణం అవుతుంది? ప్రత్యక్ష కాలంలో లేదే? అనే ప్రశ్నకు సౌత్రాంతికులు ఒక సమాధానాన్ని చెప్పారు. ప్రత్యక్షంలో విషయం కావడం అనేదానికి– ప్రత్యక్ష జ్ఞానానికి విషయమైనది తన రూపాన్ని ఇస్తున్నది అనేది అర్థం. మొదటి క్షణంలో ఉన్నా, అది తన రూపాన్ని ఇస్తుందని దీని భావం. అయితే, ఇది తప్పు. విషయం నశించిన తరువాత దాని రూపం జ్ఞానంలో ఏ విధంగా ఉంటుంది అది నశించిన దాని రూపం ఉన్నది అని అనవచ్చునా? ఉన్నా, దాని రూపం దానిని విడచి ఉండనిది కనుక, తన రూపాన్ని ఇవ్వలేదు.

## 4) యోగాచారమతదూషణం

అన్ని వస్తువులను అంగీకరించి, అవి క్షణికాలు అనే బౌద్ధులను నిరసించిన తరువాత, బాహ్యవస్తువులను అంగీకరించకుండా, జ్ఞానాన్ని మాత్రం అంగీకరించి దానిని క్షణిక పరంపరగా పలికే యోగాచారుడనే బౌద్ధుని దూషణం ఇక చేయబడుతున్నది. " "దీనిని నేను తెలుసుకుంటున్నాను, దానిని నేను తెలుసుకుంటున్నాను "అనే జ్ఞానం వలే విషయం కూడా అనుభవ సిద్ధమై ఉండగా, బాహ్యవస్తువులు లేవని అనడం తగదు. ఘటమనే జ్ఞానం, జలమనే జ్ఞానం ––<అని జ్ఞానంలో ఆకారం తెలుస్తుంది. అదేవిధంగా, బయట కూడా ఉంటే, రెండు ఆకారాలు తోచాలి కదా. ఆ విధంగా తోచడం లేదు– అని అంటే, స్ఫురించే ఆకారం బాహ్యాకారమే. జ్ఞానానికి ఆకారం లేదు. ఘటమనే జ్ఞానం అంటే, ఘటాన్ని విషయంగా కలిగిన జ్ఞానం అనే అర్థం. విషయం ఏమీ లేకుండానే, స్వప్నంలో జ్ఞానం కలగడం లేదా! అని అంటే, అది ఇక్కడ దృష్టాంతం కాబోదు. అక్కడ మేల్కొనగానే స్వప్నంలో చూసినది అంతా అసత్యమని తెలుస్తున్నాడు అదేవిధంగా మేల్కొని ఉండే కాలంలో అనుభవించినది అంతా తరువాత బాధింపబడడం లేదు.

దీనిపై ప్రశ్నింపబడుతున్నది. సూత్రకారులచే ఇక్కడ స్వప్నంలో విషయమై విషయమైన వస్తువు అసత్యమని చెప్పబడగా, స్వప్నంలో అంతా సత్యమని శ్రీ రామానుజులు పలికినది తగునా? అనేది ప్రశ్న. దీనికి సమాధానం ఏమంటే, స్వప్నంలో విషయం సత్యమనేదే వైదిక సిద్ధాంతం. అయినా ఈ పాదం యుక్తిత అన్నీ నిరూపిస్తున్నది.

స్వప్నంలోని విషయాలు సత్యమైనవి అని యుక్తితో స్థాపించలేము. పూర్వం, వేద ప్రామాణ్యాన్ని పురస్కరించుకొని వ్యాసులు ఇవి సత్యమని అన్నారు. వేదాన్ని అంగీకరించనివారు వీనిని అసత్యమని అన్నందున, దానికి మనం ఇతరులు అంగీకరించని వేదాన్ని ప్రమాణంగా చూపించలేము కనుక, యుక్తి ప్రమాణ రీతిలో సత్యమని స్థాపిస్తున్నారు కనుక, ఈ విధంగా పలకాలి. వేదంతో నిరూపించవచ్చునని తెలిస్తే ఈ సూత్రానికి వేరు విధంగా అర్థాన్ని గ్రహించాలి అంటే జగత్తు అసత్యమనేమీ పక్షంలో వైధర్మ్యమే. స్వప్నంలో కూడా సత్యమే– అని వేదాన్ని పురస్కరించుకొని అంగీకరిస్తున్నారు కనుక, ఆ వైధర్మ్యంతో స్వప్న దృష్టాంతం కూడా తగదని భావం. విషయం లేకుండా జ్ఞానం ఎక్కడా అనుభవానికి రాదు కనుక నిర్విషయ జ్ఞానవాదం సరికాదు. భ్రాంతి జ్ఞానంలో విషయం లేదు కదా! అని అంటే, అన్యథాఖ్యాతిపక్షంలో ధర్మం సత్యమే, విషయం, సంబంధం లేకపోవడానికి

సంబంధ స్ఫురణ చేత భ్రాంతి అవుతున్నది. అఖ్యాతిపక్షంలో ధర్మిజ్ఞానం వేరు, ధర్మ జ్ఞానం వేరు. రెండు యథార్థమే. అందువల్ల నిర్విషయఖ్యాతి లేదు.

### 5) ఇప్పుడు బుద్ధుని నిజమైన సిద్ధాంతం శూన్యవాదం నిరాకరింపబడుతున్నది.

శూన్యం అనేదానికి ఏమీ లేదని తెలియడం అని అర్థం దీనిని నిరూపించే విధం గమనించండి. లోకమనేదానికి ఏమి కారణం? భావవస్తువా? అభావమా? మొదటి పక్షంలో, ఒక భావపదార్థమా? అనేక భావ పదార్థాలా? మూల ప్రకృతి కారణమనేది మొదటి పక్షం. ఇది సాంఖ్య మతం. దీనిని పరమాణువులు కారణం అనే తార్కికులు దూషించారు అందువల్ల అభావమే కారణమనే పక్షాన్ని గ్రహించాలి. ఇది యుక్తికి పొసగుతుంది. విత్తనాన్ని నాటితే, అది పగిలి తరవాత మొలక వస్తుంది. అందువల్ల విత్తననాశమే మొలకకు కారణం. అందుచేత అభావమే కారణమని తేలింది ఆ భావం నుండి పుట్టేది అభావమే కదా కావాలి ఇది శూన్యవాదం ఇది ఏమాత్రం పొసగదు. లేదని మాత్రం ఎవరైనా పలికితే, దానివల్ల ఏమీ తెలిసినట్లు అవదు. "ఇది లేదు, అది లేదు" అని ఒక వస్తువును నిర్దేశించి పలికి, దాని అభావాన్ని పలకాలి. అది ఏనాడు లేకపోతే, ఇది, అది అని నిర్దేశించరాదు. అందువల్ల "ఇది ఇక్కడ లేదు, అప్పుడు లేదు" అని దేశ విశేషాన్ని, కాల విశేషాన్ని పురస్కరించుకునే పలకాలి. అప్పుడు ఇక్కడ లేదని అంటే, వేరొక చోట ఉండడం, ఇప్పుడు లేదని అంటే, వేరుకాలంలో ఉండడం ఏర్పడుతుంది. ఈ విధంగా వస్తువు, దేశం, కాలం ఉన్నాయని తెలుస్తుంది.

జగత్తును అంగీకరించి, ఈశ్వరుడు లేడని అన్నారు, నిరీశ్వరవాదులు. ఏమీ లేదన్నాడు, శూన్యవాది. అతని మాటను గ్రహించి ఈశ్వరుని కూడా ఉన్నాడని స్థాపించాలనే తలచిన నమ్మాళ్వారులు.

"ఉళనెనిల్ ఉళన్ అవనురువమ్ ఇవ్వురువుకళ్
ఉళనలనెనిల్ అవనరువమ్ ఇవ్వరువుకళ్
ఉళనెన ఇలనెన ఇవైకుణ ముడైమైయిల్
ఉళనిరుతకైమైయోడు ఒழிవిలన్ పరందే"

అని అన్నారు. చేతనాచేతనాలనే విభూతులను, వాటికి నాథుడైన ఈశ్వరుని మనం అంగీకరిస్తాం. ఈశ్వరుడంటే చేతనాచేతనాలుగా కనిపించేవానికి నియంత అని అర్థం. ఇటువంటివాడు లేడని అంటే, అన్నిటినీ కాదన్నవాడు, అని తలుస్తున్నాడు శూన్యవాది. ఆళ్వార్లు ఏమని అన్నారు? అంటే, ప్రళయకాలలో చేతనా చేతనాలు ఇప్పుడు ఉన్నట్లు స్థూలంగా లేనందు వల్ల, స్థూలాలను నియమించే స్థితిలో అతడు లేడు.

సూక్ష్మదశయే అప్పుడు అని పలికినట్లవుతుంది. అభావం కూడా భావాంతరమే కదా ఇప్పుడు ఘటం లేదు అంటే ఘటం పుట్టకుండా మట్టి ముద్ద ఏమున్నది అని కానీ, ఘటంక పగిలితే కపాలం ఉన్నదని, ఏదో ఒక వస్తువు యొక్క స్థితి స్ఫురిస్తుంది. ఆవిధంగానే అన్నీ భావించాలి. కారణం అభావమైనందున, శూన్యం నుండి శూన్యమే పుడుతుంది– అని శూన్యవాది అంటాడు. అభావం కూడా భావమై, కారణం సూక్ష్మ చేతనా చేతన విశిష్టమై, పూర్ణమైనందున, పూర్ణం నుండి పుట్టేది పూర్ణమే అని అంటారు, వీరు, ఇంతే కాక, లేదు– అని అనేది ఏ ప్రమాణం లేకుండా ఏ విధంగా సిద్ధిస్తుంది? ఉన్నది అనేదానికి ప్రమాణం కావాలి. లేదు. అనేదానికి ప్రమాణం ఎందుకు? అని అంటే, ఉన్నదని వ్యవహారంలో ఉండే దానికి లేదని అంటే, దానికి ప్రమాణం తప్పక కావాలి వ్యవహారంలో లేని దానిని లేదని అనడం వ్యర్థమే అవుతుంది. ప్రమాణం లేనప్పుడు శూన్యవాదం ఒక సిద్ధాంతం కాబోదు. శూన్యవాది చతుష్కోటి వినిర్ముక్తం, అంటే, సత్తు కాదు, అసత్తు కాదు, సదసత్తు కాదు, సదసద్విలక్షణం కాదు– అని అన్నాడు. అయిదవ ప్రకారం ఉన్నదని అంటే, శూన్యవాదం ఏది? నిజానికి నాలుగు ప్రకారాలను కూడా పలుకలేము. ఏమీ లేదనేవాడైతే ఆ విధంగా ఒక శూన్యమైనది నిజానికి ఉండి తీరాలి. లేకపోతే, అన్నీ ఉన్నాయి– అని సిద్ధిస్తుంది. దీనిని అంతటిని భట్టర్ అనుగ్రహించిన శ్రీరంగ రాజస్తవంలో చూడవచ్చు. సర్వధా అనుపత్తియే.

## 6) ఇక, జైనమతఖండనప్రకారం

దేవతల అభివృద్ధి కోసం అసురులను నాశనం చేయాలని భగవంతుడే బుద్ధునిగా అవతరించి, చార్వాక మతంవలే కాకుండా, అనాది కర్మవశ్యులు జీవులనే వాదం తోచే బౌద్ధాన్ని జనింపజేశాడు. క్షణిక వాదంలోను శూన్యవాదంలోనూ విశ్వాసం లేక, లోకంలోని వస్తువులు చిరకాలంగా ఉండి ఉండాలనే పక్షాన్ని ఆదరించినప్పుడు, అటువంటి అసురులను కూడా నాశనం చేయడం కోసం జినుని సృష్టించి, అతని ద్వారా జైనమతాన్ని ప్రచారం చేశాడు. వేద బాహ్యులు అనడం కోసం వేరు విధంగా ధర్మ మార్గాలను, మోక్షమార్గాలను కల్పించాడు. పరమాణు కారణవాదాన్ని గ్రహించి, ప్రకృతి కారణవాదాన్ని విడిస్తే వేదబాహ్యత్వం పరిపూర్ణం అవుతుంది అని ఆ మార్గాన్ని అవలంబించాడు. ఇతరులు గ్రహించని నూతన విషయం అని తనకు కావాలని అనేకాంత వాదాన్ని చేశారు. అంటే, ఒకదానికి ఇంకొకటి విరుద్ధంగా ఉండే ధర్మాలను ఒక వస్తువులో అంగీకరించడం. సత్తు, అసత్తు అవుతుంది, నిత్యం అనిత్యం అవుతుంది, భిన్నం అభిన్నం అవుతుంది, ఒకటే అనేకం అవుతుంది అని ఈ విధమైన క్రమం జైనులు ఒకదానితో ఇంకొకటి విరుద్ధంగా ఉండే ఏడు ధర్మాలను చూపి అన్నీ చేర్చి సప్తభంగి అని పేరు పెట్టారు. బురద ఒత్తుగా పూసిన

కరక్కాయ బురదగం కడిగిన తరువాత నీటిలో తేలేటట్లు జీవుడు మోక్షంలో కిందకు పడకుండా ఉంటాడని పైపైకి పోతూనే ఉంటాడని ఆలోకాకాశాన్ని చేరి నిలుస్తాడని, అక్కడ ఒక శరీరం ఉన్నదని, పలు రీతులలో మోక్షాన్ని వర్ణించారు. దీనికి అంతటికి యుక్తి ఏమీ లేనందున ప్రమాణ వాక్యం చూపాలి. దానికి ప్రసక్తి లేదు కనుక అన్ని దూషింపబడినవి అవుతాయని యుక్తితో స్థాపించిన అంశాన్ని మాత్రం వ్యాసులు దూషించారు. అంటే, అనేకాంత వాదం పరస్పరవిరోధం లేదు– అనేదే. ఈ వాదాన్ని అంగీకరిస్తే జైనులు ఏ మతం విరుద్ధం కాదని భావించవచ్చు కనుక, ఏ మతాన్ని వారు దూషించకూడదు. దీనితో జీవునకు పరిమాణం ఎంతటిది అని అంటే, ఈగ, చీమ, మేక, ఆవు, ఏనుగు, మానవుడు అనే రీతిలో ఉండే శరీరాలను గ్రహిస్తున్నందున ఆయా శరీరాల పరిమితిలో జీవుడు సంకోచించి విస్తరించి ఉండాలి. అందుచేత పలు విధాలైన పరిమాణాలు ఉన్నాయని అన్నారు. దీనిని మోక్షంలో అనే ఒకే విధమైన పరిమాణాన్ని చెప్పవలసి ఉన్నందున, అది నశించనిది కనుక, జన్మించకుండా అనాది అవుతుంది. అందువల్ల ముందే వేరు వేరు పరిమాణాలు కలిగే అవకాశం ఏమాత్రం లేదని వ్యాసులు అన్నారు.

అనేకాంత వాదనిరాసం ఇక్కడ చేయబడినందున, అనేకాంతవాదం అనే భేదాభేదవాదంతోనే భాస్కరుడు, యాదవ ప్రకాశుడనే వేదాంతుల పక్షం కూడా నిరసింపబడినట్లు అవుతుంది. ముందు, జ్ఞానం ఒకటే ఉన్నది. అన్నీ అసత్యమనే యోగాచార మతాన్ని దూషించినందున వ్యాసులు శాంకరవాదాన్ని దూషించినవారయ్యారు. ఇక్కడ భాస్కరాదులను దూషించినవారయ్యారు. అందువల్ల భాస్కరులు ప్రచ్ఛన్న జైనులు, శంకరులు ప్రచ్ఛన్న బౌద్ధులు అనబడుతున్నారు.

## 7) తరువాత, పాశుపత మత నిరాసం

ఇందులో సాంఖ్యానికి మించిన లెక్కలో తత్వాల సంఖ్యను పెంచి తత్వాలు 36 అనే వాదం ఉన్నది ఈ మతంలోని ఆచారాలు కూడా వేద విరుద్ధమైనది అనేకం కూడా వీటికి నిరాసం ప్రత్యేకంగా చేయనక్కరలేదు. వీటికి ప్రామాణ్యం లేనందున నిరాసం సిద్ధం ఇక్కడ దూషింపబడిన మతాలలో ఇదే చివరిది అయినందున ప్రత్యేకమైన సంగతి చెప్పనక్కరలేదు జైనులలో దిగంబర శాఖీయులు ఉన్నారు. ఆశుభతంలో ముందు మతాలలో ఈశ్వరుడు లేడు అయినా లోకంలో బుద్ధులు జైనులు ప్రధానులు ఆశుభతంలో ఈశ్వరుడు ఉన్నాడు అతడు మత ప్రవర్తకుడైన పశుపతి అంటారు ఈశ్వరుని అనుమానంతోనే ఈ మతంలోని వారు స్థాపించడానికి ప్రయత్నించారు ఈశ్వరుని యుక్తితో

స్థాపించడం సాధ్యం కాదని శాస్త్ర యోనిత్వాధికరణంలో మొట్టమొదట పలికినప్పుడు మనసులో ఉండే అంశాలను ఇక్కడ సూత్రకారులు వివరించారు ఇక్కడ సూత్రాలలో చెప్పబడినవానిని అక్కడ భాష్యకారులు విస్తృతంగా నిరూపించారు ఎంతగా యుక్తితో అన్వేషించినప్పటికీ శివుడే ఈశ్వరుడు విష్ణువు కాదనేది అతనికి మూర్తి సన్నివేశం ఇంకా మిగిలినది అంతా యుక్తితో స్థాపించడం వీలు కాదు ఈ విధంగా ఉండగా, రుద్రాక్ష ధారణాదులు గొప్ప ధర్మాలు అనే రీతిలోని కల్పనలు ఏ విధంగా నిలుస్తాయి? ఈ మతంలోని వారు వేదాన్ని అంగీకరించినట్లుగా అభినయించి వేద దూషణాన్ని చేస్తూ తత్వాన్ని ఆచారాన్ని వేరుగా పలికారు ఈ విధంగా పశుపతి అనే పరమశివుడు తన సమంజసస్థితిలో ఉండగా ఉండకుండా లోకాన్ని మోగింప చేయాలి అనే అభిప్రాయంతో అసమంజసుడై అసమంజసయుక్తులతో అసమంజసమైన ఆచారాలను పలికినందున అన్ని అప్రామాణికాలే. బౌద్ధ మతం జైన మతం భగవానుని చే కొందరిని నిరసించడం కోసం ప్రవచింపబడినది ఈ పాశుపతం భగవంతునిచే ప్రేరేపింపబడిన పరమశివునిచే భగవంతుని పట్ల భాగవతుల పట్ల ద్వేషాన్ని కలవారి క్రూరమైన కృత్యాలను చూచి బాధపడిన గౌతమాది భాగవతుల శాపానికి తగినట్లు వంచనతో చెప్పబడినవి కనుక పూర్తిగా నిరసింపబడతాయి దీని క్రూరత్వాన్ని చూచే నమ్మాళ్వార్లు వ్యాసులు దూషించిన మతాలను వ్యుత్క్రమంగా పలుకుతూ

"ఇలింగ త్తిట్ట పురాణ త్తీరుమ్ శమణరుమ్ శాక్కియరుమ్
వలిందు వాదుశెయ్ వీర్ కళుమ్ మ, ర్రుమ. దెయ్ వముమాగి నిన్హాన్"

అనే పాశురంలో శైవవిశేషాన్ని ముందుగా ప్రస్తావించారు. మిక్కిలి అధమమైన మతాన్ని ముందుగా నిరసించి అంతవరకు మేలైన మతాలను తరవాత నిరసించ కోరి అళ్వార్లు శైవాన్ని ముందుగా ప్రస్తావించారు. ఇంతకు ముందు కూడా " పేశనిన్ఱ శివనుక్కుమ్" అని అన్నందువల్ల కూడా శైవదూషణమే ముఖ్యమని తెలుస్తున్నది పంచరాత్రాన్ని విడచి ఈ విధంగా పలికినందున పాంచరాత్రాధికరణం దీనిని దూషించాలని వచ్చినది కాదు అనే భావమే నమ్మాళ్వార్లకు కూడా ఉన్నదని తెలుస్తున్నది. పాశుపతం జైనం బౌద్ధం అనే వ్యుత్క్రమంలో " వలిందు వాదు శెయ్ వీర్ కళుమ్" అనే ప్రయోగం తార్కికాదిమతాన్ని ఉద్దేశించి అని తెలుస్తుంది. తార్కికులు ఈశ్వరుడు అంగీకరించినా, భగవంతునకు రూపం ఉన్నదని వారు చెప్పలేదు. అయినా శివుడే గుడ్లగూబ రూపంలో కణాదునకు ఉపదేశించిన ఐతిహ్యానికి తగినట్లుగా, శివాదిశబ్దంతో విశేషంగా ఈశ్వరుని వ్యవహరించారు. పాశుపత మతస్థులు విశేషంగా యుక్తి వాదం చేస్తారు. సంహార శక్తిని కలవాడుగా అందరిచే అంగీకరింపబడిన శివుని ఎవరు సంహరించలేరని, ఆయనకు

నిత్యత్వమే అని, ఆయన సుగత కపిలాదులకంటే సర్వజ్ఞునిగా వైదిక గోష్ఠిలో ప్రసిద్ధి చెందినవాడని తలుస్తున్నారని దానిని నిరసించడం కోసం వ్యాసులు చివర " అంతవత్వం అసర్వజ్ఞతా వా" అని పశుపతికి నాశాన్ని, సర్వజ్ఞుడు కాదనే దానిని స్థాపించారు.

## 8) పాంచరాత్రమ్

"త్రిమూర్తులలో చేరిన బ్రహ్మ తన పగలు అయిన కల్పాలలో రజోగుణంగాని, తమోగుణంగాని ఉద్రిక్తమైనప్పుడు పలికిన పురాణాలన్నిటివలె, వేరొక మూర్తి అయిన పరమశివుడు పలికిన పాశుపతం వలె, విష్ణుమూర్తి పలికిన పాంచరాత్రం కూడా వ్యర్థం అయి ఉండవచ్చు కదా! " అని కొందరు ప్రశ్నించగా, " అందులో విరోధం ఏమీ కన్పించలేదే! "– అని వ్యాసులు తరువాత పలుకుతున్నారు. లోకంలో ఏ మతాభిమాని అయినా, తమ మతంతో వైదికమతం సమానమని భావించరు. అయినా, వ్యాసులు పలికినదానిని విన్నవారిలో కొందరు సాంఖ్యాదులు, "మీ మతాన్ని దూషించటానికి పలికిన తర్కాలు ఆభాసాలు అయినా, వాని వల్ల మీ మతం దూషింపబడకుండా ఉన్నా, మీ మతంతో వారి మతాలు కూడా సమానమైతే ఏమి?" అని ప్రశ్నించగా, " సమత్వం ఉండకూడదు, ఐక్యమే నిజం, వారి మతస్థాపన యుక్తులే దుర్బలాలు" అని ఇక్కడ వ్యాసులు అన్నారు. ఈ విధంగానే వారు పాంచరాత్రంలో ఒకటి రెండు వాక్యాలకు అర్థాన్ని విపరీతంగా గ్రహించి, ఇదే పాంచరాత్ర సిద్ధాంతమని భావించి, అది సమబలాన్ని కలిగినది కాదని తెలిసికొని, పాంచరాత్రం కూడా అప్రమాణం కావచ్చు కదా! అని అన్నారు. అనంతర అధికరణంలో దీనిని నిరాకరిస్తున్నారు. జీవులు అనాదిగా కర్మవశ్యులై ఒకానొక సమయంలో మోక్షాన్ని పొందుతున్నారు– అని వ్యక్తి వాదులు కూడా అంగీకరిస్తూ ఉన్నందున యుక్తితో జీవులకు ఉత్పత్తిని సాధించలేము. వేదం కూడా దీనిని తెలుపుతున్నది. వేదానికి, తర్కానికి విరుద్ధంగా జీవోత్పత్తిని పాంచరాత్రం పలికింది. లోకంలో, కర్త సాధనం లేకుండానే, కర్తయే సాధ్యాన్ని ఉత్పత్తి చేస్తున్నాడని చెప్పలేము. వృక్షాన్ని ఖండించే వాడే గొడ్డలిని చేసి దానితో వృక్షాన్ని ఖండించడం లేదా! అని అంటే, గొడ్డలిని చేయడానికి కూడా అతనికి ఒక సాధనం కావాలి కదా. సాధనం లేని జీవుడు మనసును సాధనంగా మొదట దేనినైనా ఉత్పత్తి చేయగలడా? ఆ విధంగా ఉత్పత్తి చేసేవానిని చూడలేము. అందువల్ల కూడా పాంచరాత్రం అప్రమాణం కదా అని ప్రశ్న. దీనికి మీరు పలికిన కారణాలతోనే ఆ వాక్యాలకు అది అర్థం కాదు. ముందు వెనుకలలోని సందర్భాలను చూసినా అక్కడ జీవునకు మనస్సుకు ఉత్పత్తి చెప్పబడలేదు– అని తెలుస్తుంది జీవాభిమాని సంకర్షణమూర్తికి, మనోభిమాని ప్రద్యుమ్నమూర్తికి, అహంకారాభిమాని అనిరుద్ధ మూర్తికి అవతారమే చెప్పబడుతున్నది–

అని స్పష్టంగా ఉన్నందున పాంచరాత్రం పూర్తిగా ప్రమాణమే. సూత్రకారులు కూడా మూడవ సూత్రంలో "వా" అని పదాన్ని చేర్చి జ్ఞాన శక్త్యాది గుణ విభాగాన్ని మూడుగా గ్రహించినా సంకర్షణాదిమూర్తులు మూడే వాక్యానికి అర్థమని అన్నారు. పాంచరాత్రానికి ప్రతిషేధం పల్కకూడదు– అని స్పష్టంగా అన్నారు.

ఈ అధికరణం పాంచరాత్రానికి అప్రామాణ్యాన్ని స్థాపిస్తుందని శ్రీశంకరులు వాసుదేవాది వ్యూహావతారాలను తెలుపడంలో విరోధం లేదు. నారాయణుడే జగత్తును ఉపాదాన కారణమని తెలుపడంలోనూ విరోధం లేదు– అని అప్రామాణ్యాన్ని పలుకకూడదని స్పష్టంగా పలుకుతూ, సూత్రనిర్వాహం కోసం ఏదో జీవోత్పత్తి, జీవుని నుండి మనస్సు ఉత్పత్తి అనే వాక్యానికి అర్థాన్ని గ్రహించి దూషించడానికి ప్రయాసపడ్డారు. వారి భాష్యానికి వ్యాఖ్యానమైన భామతి అనే గ్రంథానికి వివరణం కల్పతరువులో " సాక్షాత్తు విష్ణు వే పలికిన ఆ వాక్యాలకు అప్రామాణ్యం తగదు ఏదో వేరు అర్థం ఉండి ఉండాలి" అని అభిప్రాయపడ్డారు. ఆ అర్థం ఏ విధంగా అనేదానిని శ్రీ భాష్యంలో శ్రీరామానుజులు వివరించారు అద్వైతులు కూడా పాంచరాత్ర ప్రామాణ్యాన్ని అంగీకరించినందువల్లనే పాంచరాత్రక్రమంలో ఆరాధన జరిగే కోవెలలో పూజాక్రమం సర్వసమ్మతంగా లోకంలో వ్యాపించింది ఆళవందార్ ఇక్కడ సూత్రాలకు పలు విధాలుగా అర్థాన్ని తమ ఆగమ ప్రామాణ్యం అనే గ్రంథంలో తెలియజేశారు. విజ్ఞానాది అనేదానికి విజ్ఞానాన్ని కలిగినవాడు సంహరించేవాడైన మూర్తి సంకర్షణమూర్తి అనే అర్థం శ్రీ భాష్యంలో తెలుపబడినదని వ్యాఖ్యానాల వల్ల తెలుస్తుంది ఇందువల్ల ప్రద్యుమ్న అనిరుద్ధ మూర్తులను గ్రహించాలి శంకరాచార్యుల వారు పలికినట్లు బలైశ్వర్య వీర్య తేజస్సులను గ్రహించిన ఒక్కొక్క మూర్తికి రెండు రెండు గుణాలు అనే విభాగం తెలుపబడడం చేత సంకర్షణాది మూర్తులు అర్థం కావచ్చు. " తదప్రతిషేధః" అని అనడంలో తత్ అనేదానికి ఉత్పత్తి సంభవం అర్థమైతే రెండవ సూత్రంలో ఉండే ప్రశ్నకు సమాధానం చెప్పినట్లు కాదు అందువల్ల సాధారణంగా పాంచరాత్ర ప్రామాణ్యాన్ని కానీ తత్ అనే పదానికి అర్థంగా గ్రహించడం యుక్తం. సూత్రస్వారస్యాన్ని అంతటినీ గమనించకుండా సాధారణంగా పాద సంగతి కోసం అప్రామాణ్యం చెప్పడం తగునా? పాంచరాత్రం అప్రమాణం అంటే, మహాభారత విరోధమని కూడా శీభాష్యంలో అంతా సమంజసం చేసి అనుగ్రహించారు.

ఇతరమతాలకు అప్రామాణ్యం పలికే పాదంలో దీనికి ప్రామాణ్యం స్థాపించేటట్లయితే, పాద సంగతి లేదు కదా! అనే ప్రశ్నకు సమాధానం ఆరంభంలోనే

తెలియజేశాను. అధికరణ సారావళిలో ఒక విధమైన సంగతి తెలుపబడిన విషయం కూడా సూచింపబడింది. కొందరు, ముందు అధికరణాలలోవలె అన్ని సిద్ధాంత సూత్రాలు కావడమే తగును. పూర్వపక్ష, సిద్ధాంత సూత్రమే కావచ్చు. ఇక్కడ పూర్వపక్షం ఏమంటే, సాంఖ్యాది మతాలు దుర్బలాలు. అయినా, పాంచరాత్రం దుర్బలం కావచ్చు. అపౌరుషేయమైనందున వేదం ప్రమాణమనేటట్లు నిత్యసర్వజ్ఞుడు, ఆప్తుడు అయిన నారాయణుడే మహాభారతానుసారం సాక్షాత్తు వక్త అయినందున, అది కూడా ఆప్తగుణవైభవం వల్ల దోషరాహిత్యం వల్ల ప్రమాణమే అవుతుంది అందువల్ల, అందులో జీవాదులకు పలికిన ఉత్పత్తి ప్రకారాన్ని పంచకాల ప్రక్రియలనువలె అంగీకరించాలి అని అర్థం దీనికి సమాధానం ఏమంటే, క్రియలో విరోధం ఉంటే వికల్పంగా గ్రహించవచ్చు. తత్త్వంలో వికల్పం కాదు. జీవాదుల ఉత్పత్తిని పలికే పాంచరాత్ర వాక్యాలకు ఆ అర్థమే పలికితే, అది సత్తర్కానికి అనుకూలం కాదు. కర్మవశ్యులు జీవులు అనాది అయినవారు అనేదే తర్కసిద్ధం. దానికి తగినట్లు ఋగ్వేద వాక్యాలే తత్వార్థం. అందువల్ల పాంచరాత్రంలో ఆపాతమైన అర్థం గ్రహించరానిది అని మొదటి రెండు సూత్రాలలో పలికారు. తర్కవిరోధం ఉన్నందున పాంచరాత్రార్థాన్ని అంగీకరించి వేదార్థాన్ని విడువరాదని కూడా ఏర్పడింది. అయితే, పాంచరాత్రం అప్రమాణమే. వేదవిరోధం ఉన్నచోట మిగిలిన స్మృతులకు అప్రామాణ్యం పలికినట్లే అవుతుందని భావించరాదని మూడవ సూత్రంలో వాస్తవార్థాన్ని తెలిపారు. విజ్ఞానమంటే పరబ్రహ్మం. దాని భావం అంటే, ఆది అయిన ఆవిర్భావం, అంటే, వ్యూహావిర్భావం. దానికి తరువాతనే కదా విభవం, హార్దం, అర్చ అనే రూపాలు. ఈ విధంగా మొదటి ఆవిర్భావాలైన సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహాలు పాంచరాత్ర ప్రసిద్ధమైనవి. మహాభారతంలో కూడా ఇది విశదం. అది అర్థమైనప్పుడు పాంచరాత్ర వాక్యానికి నిరాకరణ లేదు. అప్రామాణ్యానికి చోటు లేదు. వేద విరోధం, తర్కవిరోధం వస్తుందనే కారణం చేతనే ఈ విధంగా అర్థాన్ని పలికామని భావించవద్దు. పాంచరాత్రంలోనే దీనికి వ్యూహావతారమే అర్థం. జీవులందరూ అనాది అయినా సంకర్షణుడు అనే ఒక జీవుడు మాత్రం అవతరించనీ. ప్రద్యుమ్నుడు అనే ఒక మనసు కర్త నుండి జనించనీ. అనిరుద్ధుడు అనే ఒక విధమైన అహంకారం మనస్సు నుండి పుట్టనీ– అని అనరాదు. జీవ మనోహంకారాలకు వ్యూహాలను అభిమానులుగా పాంచరాత్రం వలె మహాభారతం కూడా వివరించినందున అదే అర్థం అన్ని వాక్యాలకు స్పష్టంగా ఉండగా, ఇంకొక అర్థాన్ని కల్పించకూడదు. మహాభారత వాక్యాలను మా పరమార్థ భూషణ గ్రంథంలో గమనించవచ్చు. ఈ విధంగా పూర్వాధికరణ స్వరూపం సూత్రాలలో లేదు ఇంతగా పలకడం సాధ్యమైనా, జైమిని మీమాంసను అనుసరించి

ఉత్సర్గాపవాద విషయాలను పలకడమే తగినది అని శ్రీ భాష్యకారులు అప్రామాణ్య పూర్వపక్షం ప్రామాణ్య సిద్ధాంత రూపంగానే సూత్రాలకు అర్ధాన్ని అంగీకరించారు. మూడవ సూత్రానికి పలు అర్థాలు కూడినవై ఉండగా శంకర భాష్యార్థం తగదు అనేది ఆగమప్రామాణ్యంలో గమనించవచ్చు. ఈ విధమైనది ఈ అధికరణ స్థితి ఇంతటితో తర్కపాదం ముగిసింది.



# 5. అష్టాక్షరి –శారీరకమీమాంస

"మంతారం త్రాయత ఇతి మంత్రః" అనే మంత్రశబ్దవ్యుత్పత్తివల్ల ఉపాసించేవానికి అనిష్టనివృత్తిని చేసి, ఇష్టప్రాప్తిని కలిగించేది మంత్రమని తెలుస్తున్నది. ప్రణవనమశ్శబ్దాలు అద్యంతాలలో కలిగిన ఏ నామమైనా మంత్రమని చెప్పదగినది అయినప్పటికీ, భగవన్మంత్రాలన్నిటిలో షడక్షరి, ద్వాదశాక్షరి, అష్టాక్షరి–అనే అనబడే విష్ణు, వాసుదేవ, నారాయణ మంత్రాలు ముఖ్యమైనవి. వీటిలో కూడా, అర్థపూర్తిని బట్టి, మహర్షి దివ్యసూరి, పూర్వాచార్యాది శిష్ట జనపరిగృహీతం అనే వైలక్ష్యణ్యాన్ని బట్టి, అంటే, మహర్షులు, అళ్వార్లు, నాథయామునయతివరాది పూర్వాచార్యులు మిక్కిలిగా ఆదరించిన కారణాన్ని బట్టి, మంత్రరాజం అనబడే అష్టాక్షరి మిగిలిన రెండు మంత్రాల కంటే ప్రధాన మంత్రంగా పరిగణింపబడుతున్నది. " ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ, –––సర్వ మష్టాక్షరాంతఃస్థం యచ్చాన్యదపి వాఙ్మయమ్" (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం అనే నాలుగు వేదాలు –––ఇంకా వాఙ్మయమంతా అష్టాక్షరిలో ఇమిడి ఉన్నది), " సర్వవేదాంత సారార్థః సంసారార్ణవ తారకః, గతి రష్టాక్షరో నృణా మపునర్భవకాంక్షిణామ్" (సమస్త వేదాంతసారమైనది, సంసార సముద్రం నుండి దాటించేది అయిన అష్టాక్షరి మోక్షాన్ని పొందగోరే వారికి గతి) అని మొదలైన అనేక ప్రమాణాలు అష్టాక్షరి సకల వేదాంత సంగ్రహం అని తెలుపుతున్నాయి.

వేదాంతవాక్యాలలో పైపైన తోచే అర్థంలోని వైరుధ్యాన్ని పరిహరించి, యథార్థతత్వ నిర్ణయం చేయడం కోసం బాదరాయణమహర్షి శారీరక మీమాంస అనే వ్యవహరింపబడే, నాలుగు అధ్యాయాల రూపమైన బ్రహ్మసూత్రాలను రచించారు. ఇవి సర్వశరీరి ఐన పరమాత్మకు సంబంధించిన విచారాన్ని చేస్తున్నాయి కనుక, శారీరక మీమాంస అనే పేరుతో పిలువబడుతున్నాయి. మొత్తం బ్రహ్మసూత్రాల సంఖ్య 545. విచారింపబడే ప్రమేయాన్ని బట్టి కొన్ని కొన్ని సూత్రాలు ఒక్కొక్క అధికరణంగా విభాగింపబడ్డాయి. ఈ విధంగా ఉండే అధికరణాల సంఖ్య 156. ఆ విధంగానే, ఈ అధికరణాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా విభాగింపబడ్డాయి. ఒక్కొక్క అధ్యాయంలో నాలుగు పాదాలు అనే క్రమంలో శారీరక మీమాంసలో మొత్తం 16 పాదాలు ఉన్నాయి. విధంగా శారీరక మీమాంస 545 సూత్రాలతో, 156 అధికరణాలతో, 16 పాదాలతో, నాలుగు అధ్యాయాలతో విరాజిల్లుతున్నది. అందువల్ల అష్టాక్షరి వేదాంత సంగ్రహరూపం కాగా శారీరక మీమాంస

వేదాంత వివరణ అని చెప్పవచ్చు. ఈ రెండిటి మధ్య ఈ విధంగా గోచరించే వివరణ వివరణి భావం ప్రస్తుతం సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

నారాయణోపనిషత్తు అష్టాక్షరీ మంత్ర స్వరూపాన్ని " ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, నారాయణాయేత్యుపరిష్టాత్, ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే, నారాయణాయేతి పంచాక్షరాణి" (ఓం అని ప్రణవాన్ని మొదట పలకాలి. నమః అని తరువాత, "నారాయణాయ" అని ఆ తరువాత పలకాలి. ఓం అనేది ఒకటే అక్షరం. నమః అనేది రెండు అక్షరాలు, నారాయణాయ అనేది ఐదు అక్షరాలు) అని వివరించి పలికింది. "ఓం, నమః, నారాయణాయ "అనే అష్టాక్షరిలోని ఈ మూడు పదాలు క్రమంగా పరమాత్మ సర్వశేషి, సర్వశరణ్యుడు, ప్రాప్యభూతుడు అనే అర్థాలను తెలుపుతున్నాయి.

అష్టాక్షరిలోని మొదటి పదం ప్రణవం. ఇది, అకార, ఉకార, మకారాలు అనే మూడు అక్షరాల సంపుటి. ఈ మూడు మూడు ప్రత్యేకమైన పదాలు. వీటిలో, మొదటి పదమైన అకారాన్ని " అవ –రక్షణే" అనే ధాతువు నుండి పుట్టిన పదంగా గ్రహిస్తే, పరమాత్మ సర్వరక్షకుడు అనే అర్థాన్ని ఇది ఇస్తుంది. "అకారో విష్ణువాచకః " అని, " ఆ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్" అని కల ప్రమాణాలు అకార శబ్దవాచ్యుడు నారాయణుడే అనే విషయాన్ని ఘోషిస్తున్నాయి. అందుచేత అకారం ధాత్వర్థం ద్వారా నారాయణుడు సర్వ రక్షకుడు అని అర్థాన్ని ఇస్తున్నది.

ఆకారం "అకారో వై సర్వా వాక్" అనే విధంగా సమస్త శబ్దజాలానికి మూలం కనుక, అందులో వాచ్యవాచక సంబంధం ప్రకాశిస్తుంది. అందుచేత, అకారం సర్వ జగత్కారణ స్వరూపుడైన పరమాత్మను తెలుపుతుంది.

ఈ విధంగా అకారం ధాత్వర్థం ద్వారా పరమాత్మ యొక్క రక్షకత్వాన్ని, ప్రకృతి శక్తి ద్వారా ఆ స్వామి యొక్క కారణత్వాన్ని తెలియజేస్తున్నది.

ప్రణవానికి మంత్రశేషానికి మధ్య కల వివరణ వివరణి భావాన్నిబట్టి, ఆకారం నారాయణ పదానికి సంగ్రహం కనుక, నారాయణ పదంపై చతుర్థి విభక్తి వచ్చినట్లే, అకారం పై కూడా చతుర్థి విభక్తి వచ్చి లోపించింది. ఇది తాదర్థ్యంలో వచ్చింది. అందుచేత అకారం పై వచ్చి లోపించిన ఈ చతుర్థీ విభక్తి ద్వారా భగవంతుని సర్వశేషిత్వం చెప్పబడుతున్నది. దీనినిబట్టి ప్రణవంలోని అకారం పరమాత్మ యొక్క సర్వ రక్షకత్వ సర్వకారణత్వ సర్వశేషిత్వాలను తెలుపుతున్నదని తెలుస్తున్నది.

ప్రణవంలోని రెండవ అక్షరం ఉకారం. ఇది స్థాన ప్రమాణం ద్వారా అవధారణార్థాన్ని తెలుపుతున్నది. అంటే, పరమాత్మయే సర్వశేషి అనే విషయాన్ని నిష్కరించి పలుకుతున్నది. ఈ ఉకారం ద్వారా భగవానుడే సర్వకారణభూతుడు, సర్వ రక్షకుడు అనే అర్థం "సర్వం వాక్యం సావధారణమ్" అనే న్యాయంలో ప్రకాశిస్తున్నదని చెప్పవచ్చు.

ఇక, ప్రణవంలోని చివరి అక్షరం మకారం. దీనిని "మన "జ్ఞానే మను –అవబోధనే, మది – హర్షే " అని మొదలైన ధాతువుల నుండి పుట్టిన పదంగా చెప్పవచ్చు. కకారాది మకారాంతమైన వర్గాక్షరాలు 25 తత్వాలను నిర్దేశిస్తున్నవి– అనే క్రమంలో 25వ అక్షరమైన మకారం 25 వ తత్వమైన జీవ తత్వాన్ని నిర్దేశిస్తున్నది కనుక, ప్రణవ మకారం ద్వారా జీవుని జ్ఞాతృత్వం తెలియబడుతున్నది.

ఈ విధంగా ప్రణవంలోని మూడు పదాలు అనదగిన అకార, ఉకార, మకారాలనే మూడు అక్షరాల ద్వారా తెలియబడే అర్థాలు ఏమంటే – అకారంచేత తెలియపడే సర్వ రక్షకుడు సర్వకారణభూతుడు సర్వశేషి అయిన పరమాత్మ కోసమే మకారంచేత తెలియబడే జ్ఞాన స్వరూపుడైన జీవుడు ఉన్నాడు– అనే భావం వ్యక్తమవుతున్నది. సారంగా, పరమాత్మయే సర్వశేషి అనే అర్థాన్ని ప్రణవం తెలుపుతున్నది– అని గ్రహించాలి.

అష్టాక్షరిలోని రెండవ పదం నమశ్శబ్దం. ఈ పదం ఉపాయవాచకం అనే విషయం "భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" అనే శ్రుతి ప్రమాణం వల్ల, " ద్రౌపద్యా సహితా స్సర్వే నమః చక్రుః జనార్ధనమ్" (ద్రౌపదితో కలసి ఆ పాండవులందరూ శ్రీకృష్ణుని నమస్కరించారు) అనే ఉపబృంహణ వాక్యం వల్ల, " వేంగడత్తుఱైవార్ క్కు నమ ఎన్నలామ్ కడమై" అనే దివ్యసూరి వచనం వల్ల స్పష్టమవుతున్నది. అందువల్ల నమశ్శబ్దం పరమాత్మ యొక్క ఉపాయత్వాన్ని తెలుపుతున్నది.

ఇక, "నారాయణాయ" అనే తృతీయ పదం చతుర్థీ విభక్తితో కూడినది అయినందున, భగవానుడైన నారాయణునకు కైంకర్యం సర్వ దేశ సర్వకాల సర్వావస్థలలోనూ సర్వవిధాలుగా చేయాలని ప్రార్థనను తెలియజేస్తున్నది. కైంకర్యం అంటే– శేషికి యథేష్టంగా ఉపయోగపడడమే కదా. దీనివల్ల భగవానుని ఉపేయత్వం తెలుపబడినట్లు అయినది. ప్రాప్యుడైన భగవానునకు నిత్య కైంకర్యం చేయడం అనేది నిత్యవిభూతి అనే పరమపదంలోనే సాధ్యం కనుక, ముక్తుడు కర్మ బంధాన్ని తీర్చుకొని

పరమపదంలో భగవంతుని సాన్నిధ్యాన్ని చేరి, అక్కడ చేయదగిన నిత్య కైంకర్యం ఈ పదం ద్వారా తెలుపబడిందని ఏర్పడుతుంది.

ఈ విధంగా తిరుమంత్రంలోని మూడు పదాల ద్వారా వ్యక్తమయ్యే పరమాత్మ యొక్క సర్వశేషిత్వ, రక్షకత్వ, కారణత్వాలు, శరణ్యత్వం అనే ఉపాయత్వం, ఉపేయత్వం అనేవి శారీరక మీమాంసలో ఉండే నాలుగు అధ్యాయాలలో నిరూపింపబడిన క్రమం గమనించదగినది. అది ఇపుడు సంగ్రహంగా ప్రస్తావింపబడుతున్నది.

శారీరక మీమాంసలోని నాలుగు అధ్యాయాలకు వరుసగా సమన్వయాధ్యాయం (కారణాధ్యాయం), అవిరోధాధ్యాయం, సాధనాధ్యాయం, ఫలాధ్యాయం అనేవి పేర్లు. భగవంతుని కారణత్వం, అబాధ్యత్వం, ఉపాయత్వం, ఉపేయత్వం అనే ఈ నాలుగు ఈ నాలుగు అధ్యాయాలలోని ప్రధానమైన ప్రమేయాలు. మొదటి రెండు అధ్యాయాలు విషయద్వికమని కూడా చెప్పబడుతున్నవి. అంటే, బ్రహ్మ మనే విషయాన్ని గూర్చి ఇవి తెలుపుతున్నాయి. వీటికి సిద్ధద్వికమని కూడా పేరు. బ్రహ్మమనే సిద్ధవస్తువును గూర్చిన విచారం ఇందులో చేయబడుతున్నది కనుక, వీటికి ఈ వ్యవహారం ఏర్పడింది. చివరి రెండు అధ్యాయాలకు విషయుద్వికమని సాధ్యద్వికమని పేర్లు మూడవ అధ్యాయంలో బ్రహ్మ విద్యల రూపంలోని అనేక ఉపాసనలు తెలుపబడుతున్నందున, నాలుగవ అధ్యాయంలో బ్రహ్మానుభవం గూర్చి తెలుపబడుతున్నందున ఈ పేర్లు ఏర్పడ్డాయి. బ్రహ్మమనబడే భగవద్విషయానికి చెందిన ఉపాసనం విషయి కనుక, అది ప్రయత్నసాధ్యమే తప్ప, సిద్ధం కాదు. ఆ విధంగానే, బ్రహ్మానుభవం కూడా భగవద్విషయానికి చెందినది కనుక, దానిని గూర్చినది విషయి– జ్ఞానమని అర్థం. బ్రహ్మవిద్య, బ్రహ్మానుభవాలనే రెండు జ్ఞానరూపాలే కదా.

ప్రథమాధ్యాయంలోని మొదటి పాదంలో బ్రహ్మానికి జగత్కారణత్వం లేదనే వాదం నిరాకరింపబడి, జగత్కారణమైన పరబ్రహ్మనే వస్తువు ఉన్నదని నిరూపింపబడింది. అందువల్ల పరబ్రహ్మకు సంబంధించిన అసంభవ శంక మొదటి పాదంలోని మొదటి నాలుగు సూత్రాలలో తీర్చబడింది. అంటే, "చిదచిద్విలక్షణమైన బ్రహ్మమనే తత్వమే లేదు, అందువల్ల ఆ బ్రహ్మానికి లక్షణాన్ని నిర్వచించే ఆవశ్యకతయే లేదు "అనే పూర్వపక్షం మొదటి పాదంలో నిరాకరింపబడి, "బ్రహ్మమనే వస్తువు ఉన్నది, అది సర్వ జగత్కారణ" మనే విషయం నిరూపింపబడినందున, లక్ష్యాసంభవ ప్రయుక్తమైన లక్షణాసంభవశంక మొదటి పాదంలో తీర్చబడింది. శాస్త్రారంభరూపమైన మొదటి నాలుగు సూత్రాల రూపంలోని

అధికరణాలలో ప్రమేయాన్ని " వ్యుత్పత్త్యభావః ప్రతిపత్తిథౌస్థ్య మన్యేన లభ్యత్వ మథాపరత్వమ్, ఏతాని, వై సూత్రచతుష్టయేనారంభములాని నిరాకృతాని" అనే శ్లోకం తెలుపుతున్నది. వేదాంతవాక్యాలు బ్రహ్మవిషయకమైన ప్రతీతిని కలిగించవు– అనే శంకను జిజ్ఞాసాధికరణ, జన్మాద్యధికరణాలు, వేదాంతవాక్యాల వల్ల బ్రహ్మమనే తత్వమున్నది తెలిసినప్పటికీ వాటికి బ్రహ్మ ప్రతిపాదనలో దృష్టి లేదనే శంకను మిగిలిన రెండు అధికరణాలు తీరుస్తున్నాయి.

మొదటి అధికరణంలో లక్ష్యవిచార ప్రతిజ్ఞ, రెండవ అధికరణలో లక్ష్య లక్షణనిర్వచనం చేయబడగా, మూడవ అధికరణంలో లక్షణ విషయంలోని సందేహం, నాలుగవ అధికరణంలో లక్ష్యవిషయంలోని శంక తీర్చబడ్డాయి. మొదటి పాదంలోని మిగిలిన ఏడు అధికరణాలలో, సామాన్య శబ్దఘటితాలైన కారణ వాక్యాలు, విశేష శబ్దఘటితాలైన కారణవాక్యాలు ప్రకృతి పురుష విలక్షణుడైన పరమాత్మపరాలని నిరూపింపబడింది. ప్రథమాధ్యాయంలోని రెండవ, మూడవ, నాల్గవ పాదాలలో బ్రహ్మం వేదాంతవేద్యం అయినప్పటికీ, వేదాంతాలలో బ్రహ్మ భిన్నమైన వస్తువు కూడా జగత్కారణంగా చెప్పబడుతున్నదే! అనే వాదం నిరసింపబడి, జగత్కారణ వాక్యాలన్నీ చిదచిద్విలక్షణ బ్రహ్మ పరాలని నిరూపింపబడింది. అంటే, బ్రహ్మలక్షణంలో అవ్యాప్తి దోషం నివారింపబడింది. ఈ విధంగా ప్రథమపాదం అయోగవ్యవచ్ఛేద పరం, మిగిలిన మూడు పాదాలు అన్యయోగ వ్యవచ్ఛేదపరం అని చెప్పవచ్చు.

మొదటి అధ్యాయంలో నిరూపింపబడిన పరమాత్మజగత్కారణత్వం రెండవ అధ్యాయంలో స్థూణానిఖననన్యాయంలో ద్రఢీకరింపబడుతున్నది. స్మృతులతో, తర్కాలతో బ్రహ్మ జగత్కారణత్వాన్ని ప్రతివాదులు అడ్డుకోగా, వారి వాదాలను నిరసించి, బ్రహ్మం జగత్కారణమనే విషయాన్ని స్మృతి, తర్కపాదాలనే మొదటి రెండు పాదాలు స్థిరపరుస్తున్నాయి. బ్రహ్మకార్యం కాని వస్తువు కూడా ఉన్నది– అనే వాదం వియత్పాద, ప్రమాణ పాదాలనే చివరి రెండు పాదాలలో నిరసింపబడింది.

ఈ విధంగా శారీరకంలోని మొదటి రెండు అధ్యాయాలు పరమాత్మ జగత్కారణత్వాన్ని సమగ్రంగా, అప్రధృష్యంగా నిరూపిస్తున్నాయి కనుక, ఇవి ప్రణవంలోని అర్థాన్ని వివరిస్తున్నాయని చెప్పవచ్చు. ఈ అధ్యాయాలు రెండిటిలో పరమాత్మ చిదచిత్తులను శరీరంగా కలవాడని తెలుపబడినందున, పరమాత్మ సర్వశేషి అనే అంశం నిరూపింపబడినట్లే కదా. శరీరం, దానిని కలిగిన శరీరికి శేషమే కదా.

ఇక, శారీరకంలో పరమాత్మ రక్షకత్వం ఏ విధంగా తెలుపబడింది? అని అంటే, అకారంలోని ధాత్వర్థం ద్వారా తెలుపబడిన రక్షకత్వం కారణత్వరూపమైన పితృత్వం ద్వారా భాసిస్తున్నదని చెప్పవచ్చు. "ప్రజానాం వినయాధానాద్రక్షణాద్భరణాదపి, స పితా" (ప్రజలకు వినయాన్ని కలిగించడం వల్ల, రక్షించడం వల్ల పోషించడం వల్ల వారికి అతడు తండ్రి అయ్యాడు) అనే విధంగా పితృత్వ పూర్తికి రక్షకత్వం కూడా ఆవశ్యకమే కనుక, " భూతానా మవ్యయః పితా" (ప్రాణులకు ఏ నాడూ నశించని తండ్రి) అని, "ఎన్డుమ్ ఇఱవాద ఎందై" (ఏనాటికి నశించని తండ్రి) అని, " మాతా పితా నారాయణః" (తల్లి, తండ్రి నారాయణుడే) అని కీర్తింపబడే సర్వజగత్పిత అయిన పరమాత్మ యొక్క కారణత్వం రక్షకత్వవ్యాప్యం. అంతేకాక, వివరణిలో ఉండే ప్రతి అంశం తప్పక వివరణంలో ఉండాడాలనే నియమం ఏమీ లేదు కదా.

శారీరకమీమాంసలోని మూడవ అధ్యాయంలో, బ్రహ్మోపాసనకు సంబంధించిన విచారణ చేయబడింది. ఈ ఉపాసనా విచారం ప్రధానంగా మూడవ పాదంలో చేయబడింది. బ్రహ్మోపాసనకు ఇతర విషయ వైరాగ్యం, భగవంతుని విషయంలో కోరిక అనే రెండు చాలా ఆవశ్యకాలు. ఈ రెండిటి సిద్ధి కోసం మొదటి పాదంలో జీవుని దోషాలు చాలా వివరంగా నిరూపింపబడ్డాయి. ఇవి తెలిస్తే లౌకిక విషయ వైరాగ్యం కలుగుతుంది కదా. భగవంతుని విషయంలో తృష్ణ కలగడం కోసం భగవానుని కళ్యాణ గుణాల విచారం రెండవ పాదంలో చేయబడింది. ఈ పాదంలోని ఎనిమిది అధికరణాలలో, మొదటి నాలుగు అధికరణాలు జీవుని స్వప్న సుషుప్త్యాధి దశలలోని దోషాలు తెలుపబడినప్పటికీ, తరువాత కల 4 అధికరణాలలో పరమాత్మ కళ్యాణ గుణాలు నిరూపింపబడినందున, ఈ పాదంలో ప్రధానమైన దృష్టి భగవంతుని కల్యాణ గుణాలను తెలుపడంలోనే– అని పెద్దల అభిప్రాయం. మొదటి నాలుగు అధికరణాలలో స్వప్న పదార్థ సృష్టిని చేయడంలో పరమాత్మకు కల కళ్యాణ గుణాలు తెలుపబడినందున, ఈ పాదం పరిపూర్ణంగా భగవత్కళ్యాణ గుణ ప్రతిపాదకమని అనడంలో ఏ అడ్డు లేదు. ఇక నాలుగవ పాదంలో బ్రహ్మవిద్యలకు అంగాలైన కర్మల విచారం చేయబడింది.

ఈ విధంగా శారీరక మీమాంసలోని మూడవ అధ్యాయంలో పూర్తిగా భగవద్భక్తికి సంబంధించిన విచారం చేయబడినందున, ఇందులోని ప్రమేయం, అష్టాక్షరీ మంత్రంలో ఉపాయనిష్కర్షను చేసే మధ్యమ పదమైన నమశ్శబ్దం చేత ప్రతిపాదితమైన ప్రమేయం – అనే ఈ రెండు ఒకటే– అని ఏర్పడుతున్నది. సిద్ధోపాయరూపుడైన భగవంతుడే మోక్షానికి

సాక్షాత్తుగా ఉపాయమైనా, అంటే, భగవంతుని నిర్హేతుక కృపయే ఉపాయమైనప్పటికీ ఆ భగవత్కృప ప్రసరించటానికి తగిన యోగ్యతను ఉపాసనా రూపమైన భక్తి కలిగిస్తుంది కనుక, ఈ భక్తి పరంపరయా మోక్షోపాయం అవుతున్నదని గ్రహించడంలో అడ్డులేదు. " యమేవైష వృణుతే తేన లభ్యః" (భగవంతుడు ఎవరిని వరిస్తాడో అతని చేతనే ఆ భగవంతుడు పొందబడుతున్నాడు) అనే పరగత స్వీకార రూపమైన భగవత్కృపయే పరమాత్మ ప్రాప్తికి ఉపాయం– అని పలికిన శ్రుతియే, " దష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని నిధిధ్యాసనరూపమైన భక్తిని కూడా మోక్షోపాయంగా పలికింది కదా. " భక్త్యా లభ్య స్త్వనన్యయా", " భక్తిక్రీతో జనార్ధనః" అని మొదలైన ఉపబృంహణవచనాలు, "పత్తుడై అడియవర్. క్కు ఎళియవన్" (భక్తిని కలిగినవారికి సులభుడు) అని మొదలైన దివ్యసూరుల సూక్తులు ఇక్కడ స్మరణీయాలు. నిరంతరోపాసనా రూపమైన భక్తి వల్ల భగవంతుని అనన్యోపాయత్వనిశ్చయం కలుగుతుంది –అని అనడంలో లోటు లేదు కూడా. అందుచేత, శారీరకంలోని మూడవ అధ్యాయానికి, అష్టాక్షరిలోని రెండవ పదం అయిన నమశ్శబ్దానికి మధ్య ఐకకంఠ్యం సిద్ధం.

ఫలాధ్యాయం అనబడే నాలుగవ అధ్యాయంలోని మొదటి రెండు పాదాలకు ఆవృత్తిపాదమని, ఉత్క్రాంతి పాదమని పేర్లు. మూడవ అధ్యాయంలో నిరూపింపబడిన బ్రహ్మ విద్యలకు పూర్వాఘ ఉత్తరాఘాల ఆశ్లేష వినాశాలు, ఉత్తరాఘానికి ఆ దేహం నుండి జీవుని బ్రహ్మ రంధ్రం ద్వారా నిర్గమనం అనేవి ఫలాలుగా ఈ రెండు పాదాలలో నిరూపించబడ్డాయి. ఈ రెండు అనిష్ట నివృత్తి రూపాలు. ప్రథమపాదంలోని మొదటి ఆరు అధికరణాలలో బ్రహ్మ విద్యా స్వరూప శోధనం చేయబడగా, తరువాత ఉండే ఐదు అధికరణాలలో విద్యాఫలం తెలుపబడింది. ముక్తిరూప ఫలాన్ని నిరూపించే ఈ నాలుగవ అధ్యాయంలో ఉపాయరూపాలైన బ్రహ్మ విద్యల స్వరూప విచారం చేయబడడం అనేది – భగవద్భక్తి "సుసుఖం కర్తు మవ్యయమ్" అనే విధంగా ఫలమైనందున తగినది. " పుల్ గు పற்றற்றே" (ఇతర విషయ సంగాన్ని విడచిపెట్టి, భగవంతుని ప్రీతితో సంశ్లేషించు) అని ఆళ్వారులు కూడా భక్తిని అంగనాపరిష్వంగం వలె సుఖరూపం అన్నారు.

రెండవ పాదమైన ఉత్క్రాంతి పాదంలో ఉపాసన వల్ల కలిగే స్థూలదేహనివృత్తి తెలుపబడింది. బ్రహ్మవిద్యానిష్ఠునకు కలిగే పూర్వాఘ ఉత్తరాఘాల అశ్లేష వినాశరూపమైన ఫలం మొదటి పాదంలో తెలుపబడగా, బ్రహ్మ వేత్తకు కూడా మరణం అనేది ఉన్నది– అని రెండవ అధ్యాయంలో నిరూపింపబడింది. జీవుని జాగ్రదవస్థావిచారం మూడవ

అధ్యాయంలో నిరూపింపబడినప్పుడు, అక్కడే మరణం గూర్చి కూడా తెలుపబడాలి కదా! అని అంటే, ఉపాసకునకు మరణం అనేది సుఖరూపం కనుక "అత్ర బ్రహ్మ సమశ్నుతే" (ఇక్కడే బ్రహ్మను పొందుతున్నాడు) అనే శ్రుతివాక్యాన్ని పురస్కరించుకొని వచ్చిన, ఉపాసకునకు మరణం లేదనే వాదాన్ని నిరసించడం ఆ ప్రకరణంలో ఆవశ్యకం కనుక, రెండవ పాదంలో మరణ చింతన చేయబడింది.

గతిపాదం, ముక్తి పాదం అనే మూడవ, నాలుగవ పాదాలలో దేహం నుండి వెలువడిన ఉపాసకునకు అర్చిరాధి మార్గం ద్వారా కలిగే బ్రహ్మలోక ప్రాప్తి, పునరావృత్తి లేని పరిపూర్ణ బ్రహ్మానుభవాలు నిరూపింపబడ్డాయి. ఇవి ఇష్ట ప్రాప్తిరూపాలు. గతిపాదంలో బ్రహ్మలోకానికి తీసుకొని పోయే దివ్య పురుషుల వివరం, తీసికొని వెళ్ళే క్రమం, స్థానం మొదలైనవి విచారింపబడ్డాయి. ఇక, ముక్తిపాదంలో అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మ లోకాన్ని చేరిన విద్యానిష్ఠునకు పరిపూర్ణమైన బ్రహ్మానుభవం కలిగే క్రమం వివరించబడింది. ఇది అంతా నారాయణ శబ్ద వివరణమే కదా. పరమపదంలో పరమాత్మకు సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో సర్వవిధ కైంకర్యమే ఆ బ్రహ్మానుభవం. అక్కడ ముక్తుడు పరమాత్మ యొక్క అనంతలైన స్వరూప రూప లీలల అనుభవాన్ని పొందుతాడు. నారాయణ నామం నిరవధిక స్వరూపరూప గుణవిభవలీలావిశిష్టుడైన పరమాత్మను తెలుపుతున్నది కనుక, ముక్తుని బ్రహ్మానుభవం నారాయణ శబ్దార్థానుభవమే. అయితే, అష్టాక్షరిలో జీవుడు నారాయణకు మాత్రమే భోగ్యుడు– అని తెలుపబడగా, శారీరకంలో జీవుని పరబ్రహ్మానుభవం తెలుపబడింది. అంటే, జీవుడు పరమాత్మానుభవాన్ని పొందుతాడని తెలుపబడిందే. ఇది వ్యుత్క్రమంగా గోచరిస్తున్నది కదా! అనే సందేహం కలుగవచ్చు.

"సోశ్నుతే సర్వాన్ కామన్ సహ బ్రహ్మణావిపశ్చితా" అనే శృతి వాక్యంలోని కామశబ్దానికి "కామ్యంత ఇతి కామాః"అనే వ్యుత్పత్తి ద్వారా చెప్పబడే భగవంతుని కల్యాణ గుణాలు మిగిలిన అన్నిటినీ లక్షిస్తాయి. లీలా విభూతి భగవంతుని విభూతులలో అంతర్భవిస్తుంది కనుక, ముక్తునకు లీలావిభూతి కూడా అనుభావ్యమే. " ఇమాన్ లోకాన్ కామాన్ కామరూపీ అనుసంచరన్"అని శ్రుతివాక్యం.

ఈ విధంగా సర్వప్రకార విశిష్టుడైన పరమాత్మ అయిన శ్రీమన్నారాయణడే ప్రాప్యుడనే, తిరుమంత్రంలోని పదమైన "నారాయణాయ" అనే పదం ద్వారా తెలుపబడిన అర్థమే శారీరకంలోని నాలుగవ అధ్యాయంలో నిరూపింపబడినందున, ఈ రెండిటి ప్రమేయాలలోని ఐక్యం సిద్ధం.

ముక్తుని సంపూర్ణ బ్రహ్మానువభవాన్ని తెలిపే ఫలాధ్యాయంలోని "అనావృత్తిః శబ్దాత్" అనే చివరి సూత్రంలో జీవుని అపునరావృత్తి తెలుపబడింది. దీనికి కారణం, అతడు పరమాత్మకు అత్యర్థ ప్రియుడు కావడమే. కనుక, ఈ సూత్రంలో జీవుని అనన్య భోగ్యత్వం కూడా తెలుపబడినదని అనడంలో సందేహం లేదు కనుక, అష్టాక్షరిలో తెలుపబడిన జీవుని అనన్యభోగ్యత్వం కూడా ఫలాధ్యాయంలో చెప్పబడినది– అనేది సుస్పష్టం.

ఏతావతా ఏమి స్పష్టమైనది? అని అంటే, అష్టాక్షరిలోని మూడు పదాల ద్వారా తెలియజేయబడే ఈ జీవుని అనన్యార్హశేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వాలు అనే ఈ మూడు విషయాలు శారీరక మీమాంసలో నాలుగు అధ్యాయాలలో ప్రతిపాదింపబడినందున, ఈ రెండిటికి అర్థంలో ఐకకంఠ్యం స్పష్టమని ఏర్పడుతున్నది.

ఇంకొక విధంగా కూడా అష్టాక్షరి –శారీరక మీమాంసల మధ్య ప్రతిపాద్యసామ్యాన్ని దర్శించవచ్చు.

అష్టాక్షరిలోని ప్రణవం, నమః శబ్దం, నారాయణాయ అనే పదం– అనే ఈ మూడు పదాలలో, మొదటి పదమైన ప్రణవానికి, మిగిలిన రెండిటికి మధ్య వివరణ వివరణి భావం ఉన్నదని శ్రీపిళ్లైలోకాచార్యులవారు ముముక్షుప్పడి అనే రహస్య గ్రంథంలో " ఇని మేల్, ప్రణవత్తై వివరిక్కిఱదు నమస్సు –––" ఇత్యాదిసూత్రాలలో "మంత్ర శేషం, అనబడే నమశ్శబ్దం, నారాయణాయ అనబడే పదాలు ప్రణవాన్ని వివరిస్తున్నాయి, ఆ క్రమంలో, ఉకారాన్ని నమశ్శబ్దం వివరిస్తున్నది, అకారాన్ని నారాయణ పదం వివరిస్తున్నది, మకారాన్ని నారాయణ పదంపై ఉండే చతుర్థీ విభక్తి వివరిస్తున్నది, మకారాన్ని నారాయణ పదంలోని నారపదం వివరిస్తున్నది అని కూడా కొందరు అంటారు" అని తెలియజేశారు.

వివరణం అంటే– పూర్వం చెప్పబడిన విషయానికి ఉపయోగించే అర్థాంతరాన్ని తెలియజేస్తూ, ప్రస్తుతార్థాన్ని వివరించడం– అని శ్రీవరవరమునులు ఈ సందర్భంలో తమ వ్యాఖ్యలో తెలియజేశారు. ప్రణవంలోని ఉకారం అవధారణార్థకం. ప్రణవంలోని లుప్తచతుర్థితో కూడిన ఆకారం జీవుడు భగవంతునకు శేషమని తెలుపుతున్నది. జీవుడు భగవంతునికే తప్ప ఇంకొకరికి శేషం కాదు– అనే విషయాన్ని అవధారణార్థాన్ని తెలియజేసే ఉకారం తెలుపుతున్నది. ఈ విధంగా ఉకారం ద్వారా తెలుపబడిన జీవుని భగవదనన్యార్హ శేషత్వాన్ని నమశ్శబ్దం మరింత విశదీకరిస్తున్నది. అన్యశేషత్వాన్ని నిషేధించేటప్పుడు, భగవంతుని కంటే ఇతరులకు అతడు శేషం కాకపోయినా, తనకు తాను శేషం కావచ్చు

కదా! అనే భావం తోచవచ్చు. ఆ భావాన్ని "నేను నాకు శేషం కాదు" అని అర్థం ఇచ్చే నమశ్శబ్దం నిషేధిస్తున్నది. ఈ విధంగా ఉకారార్థాన్ని నమశ్శబ్దం వివరిస్తున్నది.

ప్రణవంలోని అకారం భగవంతుని రక్షకత్వాన్ని తెలుపుతున్నది. రక్షకత్వం అనేది రక్ష్య సాపేక్షం కనుక, రక్షింపబడే చేతనాచేతనాలు ఇక్కడ లక్షింపబడతాయి. రక్షణకు కావలసిన జ్ఞానం, శక్తి, కరుణ మొదలైన గుణాలు కూడా లక్షింపబడతాయి. వీటిని అన్నిటిని నారాయణ పదం శబ్దతః తెలుపడం ద్వారా వివరిస్తున్నది.

ప్రణవంలోని అకారం " అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్" (అ అనేది భగవానుడైన నారాయణుని మొట్టమొదటి పేరు) అనే విధంగా పరమాత్మను తెలుపు న్నది. ఈ అకారం " అకారో వై సర్వా వాక్ "అనే విధంగా సమస్తశబ్దాలకు మూలం. పరమాత్మ సమస్త వాచ్యసముదాయానికి మూలమైనందున, వాచ్యవాచక సంబంధం అకారానికి, పరమాత్మకు మధ్య భాసిస్తున్నది. ఈ విధంగా అకారం పరమాత్మకు కల సర్వకారణత్వాన్ని తెలుపుతున్నది. ఆకారం పై వచ్చి లోపించిన లుప్త చతుర్థీ విభక్తి పరమాత్మ యొక్క సర్వశేషిత్వాన్ని తెలియజేస్తున్నది. అకారం ద్వారా తెలుపబడే భగవానుని సర్వకారణత్వ, సర్వశేషిత్వాలు రెండు నారాయణపదం చేత వివరింపబడుతున్నాయి. " నరుడు అనబడేవాడు పరమాత్మ. ఆ పరమాత్మ నుండి అన్ని వస్తువులు పుడుతున్నాయి. అందుచేత వాటికి నారాలు అని పేరు. వాటిని నివాస స్థానంగా కలవాడు కనుక, పరమాత్మ నారాయణ పదంచేత చెప్పబడుతున్నాడు" అనే పౌరాణికమైన నారాయణ శబ్ద నిర్వచనం నారాయణ నకు గల సర్వకారణత్వాన్ని తెలుపుతున్నది. సమస్త తత్వాలకు, పరమాత్మకు మధ్య ఉండే ఈ శరీర శరీర భావం ఆ స్వామికి కల సర్వశేషత్వాన్ని సూచిస్తుంది కదా. " సర్వాత్మనా ఆధేయతయా, నియమ్యతయా, శేషతయా చ అపృథక్సిద్ధం ప్రకారభూతమితి ఆకారః శరీరమితి చోచ్యతే" (అన్ని విధాలుగా ఆధారపడి ఉండేదిగా, నియమింపబడేదిగా, శేషంగా, విడదీసి చూడడానికి వీలు కానిదిగా ఉన్న ప్రకారంగా ఉండే ఆకారం శరీరం అని చెప్పబడుతున్నది) అని వేదార్థ సంగ్రహంలో భగవద్రామానుజులు శరీరంగా ఉండడం శేషత్వాన్ని సూచిస్తుందని అన్నారు. ఈ విధంగా ప్రణవంలోని అకారాన్ని నారాయణ పదం వివరిస్తున్నది.

ప్రణవంలోని మకారాన్ని మంత్రశేషంలోని చతుర్థీ విభక్తి వివరిస్తున్నది. ప్రణవంలోని మకారం " మన– జ్ఞానే, మను –అవబోధనే, మది – హర్షే" మొదలైన ధాతువుల నుండి పుట్టిన పదమైనప్పుడు, జ్ఞానానందాలను లక్షణంగా కల జీవుని

నిర్దేశిస్తుంది. "మసి–పరిమాణే "అనే ధాతువు నుండి పుట్టినదిగా భావిస్తే, జీవుడు అణుపరిమాణుడని తెలుపుతున్నది. అంతేకాక కకారం మొదలుకొని మకారం వరకు ఉండే వర్ణాలలో, మకారం 25 వ వర్ణం అయినందున, ఇది 25వ తత్వమైన జీవుని తెలుపుతుంది. ఈ విధంగా మకారం జ్ఞానానందాలను లక్షణంగా కలిగిన, అణుపరిమాణుడైన జీవుని నిర్దేశిస్తున్నదని తెలుస్తున్నది.

జీవుని జ్ఞాతృత్వం భోక్తృత్వాన్ని లక్షిస్తుంది. చైతన్య ప్రయుక్తమైన ఈ భోకృత్వం జీవుని అంతరంగ లక్షణం కాదు. శేషత్వమే జీవుని అంతరంగ నిరూపకం. అందువల్ల జీవుని భోక్తృత్వం కంటే భగవానునకు మాత్రమే ఇష్ట వినియోగార్హమై ఉండడమనే అనన్య భోగ్యత్వమే ప్రధాన లక్షణమనే విషయాన్ని నారాయణ పదంపై ఉండే వ్యక్త చతుర్థి తెలుపుతున్నది. ఈ విధంగా ఈ చతుర్థి, మకారంచేత స్పష్టం చేయబడని జీవుని అనన్య భోగ్యత్వాన్ని తెలుపుతున్నది కనుక, మకారానికి వివరణ రూపమైనది.

మకారంచేత జీవుని జ్ఞాతృత్వం చెప్పబడినప్పటికీ, జీవతత్వానికి గల నిత్యత్వం, అనేకత్వం, ఏకరూపత్వం మొదలైన ధర్మాలు మకారం ద్వారా స్పష్టం కావడం లేదు. వీటిని నార శబ్దం తెలుపుతున్నది. నారాలంటే నిత్య వస్తువుల సమూహాలే కదా.

ఈ విధంగా గమనించి చూసినప్పుడు, ప్రణవార్థాన్ని మంత్రశేషం వివరిస్తున్నది కనుక, ఈ రెండిటికీ మధ్య గల వివరణ వివరణి భావం స్పష్టమవుతున్నది. ఇటువంటి వివరణ వివరణి భావాన్ని శారీరకంలో కూడా గమనించవచ్చు.

శారీరకంలో వేదవ్యాసులు ఉపోద్ఘాత రూపమైన చతుస్సూత్రి తరువాత, ఈక్షత్యధికరణంలో శాస్త్రారంభాన్ని చేశారు. ఈ అధికరణంలోని. " ఈక్షతేః నాశబ్దమ్" (జగత్కారణం ప్రకృతి కాదు, "తదైక్షత" అని సృష్టి మూలంగా చెప్పబడిన ఈక్షణ రూపమైన క్రియ అచేతనమైన ప్రకృతికి సంభవించదు కనుక) అనే సూత్రం ద్వారా పరమాత్మ జగత్కారణుడు, ఆచిత్తు కంటే విలక్షణుడు– అనే విషయాన్ని తెలియజేశారు. " తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" (ఆ పరమాత్మను ఆరాధించేవారికి మోక్షం కలుగుతుందని ఉపదేశింపబడడం వల్ల) అనే సూత్రం ద్వారా అతడే మోక్షోపాయమని నిశ్చయించారు. జగత్కారణాన్నే కదా వేదాంతం "కారణం తు ధ్యేయః" అని మోక్షోపాయంగా పలికింది. తరువాత, ఆనందమయాధికరణంలో అతడే ప్రాప్యభూతుడని, అతడు బద్ధముక్త ఉభయ విలక్షణుడని తెలియజేశారు. " "ఆనందమయో ఽ భ్యాసాత్" (ఆనందమయుడు పరమాత్మయే, ఎందుకంటే, శ్రుతులలో అతని ఆనందం నూరు నూరు రెట్లు పెంచి

పలికినందున), " కామాచ్చ నానుమానాపేక్షా" (పరమాత్మ తన సంకల్పంతో సృష్టి చేసినట్లు శ్రుతిలో చెప్పబడినందున, జగత్సృష్టిలో అచిత్ సంబంధం అపేక్షితం కాదు), " నేతరోనుపపత్తేః" (బ్రహ్మం కంటే వేరైన ముక్త పురుషుడకూడా ఆనందమయుడు కాడు, ముక్తునకు నిరుపాధికమైన విపశ్చిత్త్వం ఉండదు, ఎందుకంటే, అది అనుపన్నం కనుక), " భేదవ్యపదేశాచ్చ" (జీవుడు ఆనందమయుని కంటే భిన్నుడుగా చెప్పబడినందున, జీవుడు ఆనందమయుని కంటే భిన్నుడు) అనే సూత్రాల ద్వారా తెలిపారు. తరువాత అంతరధికరణంలో పరమాత్మ దివ్యమంగళ విగ్రహం కలవాడని అన్నారు. " పరమాత్మ జగత్కారణభూతుడు, మోక్షోపాయభూతుడు, ప్రకృతి పురుషుల కంటే విలక్షణుడు, దివ్య మంగళ విగ్రహాన్ని కలవాడు" అనే వ్యాస సిద్ధాంత వివరణమే మిగిలిన శారీరక శాస్త్రం అంతా.

పూర్వం నిరూపించినట్లుగా, ఈక్షత్యధికరణంలో నిరూపించిన పరమాత్మ సర్వజగత్కారణ రూపుడు, చిదచిద్విలక్షణుడు–అనే విషయాన్ని శారీరకంలోని సమన్వయ, అవిరోధాధ్యాయాలు అనే మొదటి రెండు అధ్యాయాలు, " తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" అనే సూత్రంద్వారా తెలుపబడిన పరమాత్మ మోక్షోపాయభూతుడు అనే విషయాన్ని మూడవ అధ్యాయం, ఆనందమయాధికరణ ద్వారా తెలుపబడిన ఆనందమయుడైన పరమాత్మ ప్రాప్యభూతుడు అనే విషయాన్ని ఫలాధ్యాయం అనబడే నాల్గవ అధ్యాయం వివరిస్తున్నవి. ఈ విధంగా ఈక్షత్యధికరణంనుండి ఉండే మూడు అధికరణాల వివరణమే మిగిలిన భాగం కనుక, ఈ రెండిటి మధ్య గల వివరణ వివరణిభావం స్పష్టమవుతున్నది.

ప్రసంగవశంచేత ఇంకొక విషయం కూడా ఇక్కడ ప్రస్తావించబడుతున్నది. ప్రణవంలోని అకారం ప్రకృతి శక్తి ద్వారా అకార శబ్దవాచ్యుడైన భగవంతుని కారణత్వాన్ని, ధాత్వర్థం ద్వారా రక్షకత్వాన్ని తెలుపుతున్నవి. ఈ కారణత్వ, రక్షకత్వాలు ప్రణవంలోని మధ్యమాక్షరమైన, అవధారణార్థకమైన ఉకారం ద్వారా విశేషింపబడడం వల్ల, భగవంతుడే జగత్కారణభూతుడు అని, అతడే రక్షకుడు అనే విషయం స్పష్టపడుతున్నది. వీటిలో, మొదటి అంశాన్ని, అంటే, కారణత్వాన్ని, శారీరకంలోని మొదటి రెండు అధ్యాయాలు నిరూపించగా, రెండవ అంశమైన రక్షకత్వాన్ని మూడవ అధ్యాయం నిరూపిస్తున్నది. ప్రణవంలోని మూడవ అక్షరం అయిన మకారం ద్వారా జీవుని జ్ఞాతృత్వ భోక్తృత్వాలు తెలుపబడుతున్నవి. లుప్త చతుర్థీ విభక్తితో కూడుకున్న అకారం ద్వారా భగవానుని సర్వశేషిత్వం చెప్పబడుతున్నందున, ఈ సర్వశేషిత్వ దృష్టిలో మకార శబ్దవాచ్యుడైన జీవుని జ్ఞాతృత్వ భోక్తృత్వాలను గమనించినప్పుడు, అవి భగవదానందాధీనమైనవని తెలుస్తున్నది.

కనుక, జీవుని అనన్యభోగ్యత్వం స్పష్టపడుతున్నది. అంటే, జీవుని చైతన్య ప్రయుక్తమైన ఆనందం అతని స్వరూపంలోకి చేరినదే అయినా, అతని స్వరూపానికి శేషత్వ పారతంత్ర్యాలు అంతరంగ నిరూపకాలు కనుక, వాటికి తగినట్లు అతడు భగవదానందానికి ఉపయోగపడినప్పుడు ఆ భగవంతుని కలిగే ప్రీతిని చూసి అతడు పొందే ఆనందమే స్వరూపానికి అనుగుణమనే విషయం స్పష్టమవుతున్నది. ఈ విధమైన జీవుని అనన్య భోగ్యత్వం చతుర్థాధ్యాయంలో వివరింపబడింది. ఈ అధ్యాయంలో జీవుడు పరమపదాన్ని చేరి అక్కడ పొందే బ్రహ్మానుభవాన్ని గూర్చి వివరింపబడినట్లే, అనన్య భోగ్యత్వం కూడా "అనావృత్తిః శబ్దాత్" ఇత్యాది సూత్రాలలో తెలుపబడిన వైనాన్ని భగవద్రామానుజులు తమ అందమైన సూక్తుల ద్వారా స్పష్టం చేశారు. శ్రీభాష్యంలో చివరిలో " న చ పరమ పురుషః సత్యసంకల్పః అత్యర్థ ప్రియం జ్ఞానినం లబ్ధ్వా న కదాచిదావర్తయిష్యతి " (సత్య సంకల్పుడైన పరమ పురుషుడు తనకు చాలా ఇష్టమైన జ్ఞాని అయిన ఆత్మను పొంది, మళ్ళీ తిరిగి అతనిని ఈ లోకానికి రానివ్వడు) అనే సూక్తి ఇక్కడ స్మరణీయం. ఈ విధంగా శారీరకమీమాంస ప్రణవార్థ వివరణం అనే అంశం కూడా గమనించదగినది.

"ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగ మివాపరమ్, పరస్య బ్రహ్మణో యత్ర శేషిత్వం స్ఫుట మీక్ష్యతే" (వేరొక శ్రీరంగ విమానంవలె, ప్రణవాకారంగా ఉండే శ్రీభాష్యాన్ని శరణు పొందుతున్నాను. శ్రీరంగ విమానంలో శేషశాయిత్వరూపమైన శేషిత్వం, శ్రీ భాష్యంలో, ప్రణవంలో చేతనా చేతనాలను అన్నిటిని తనకు యథేష్ట వినియోగార్హంగా కలిగి ఉండడం అనే శేషిత్వం స్ఫుట పడుతున్నాయి) అనే ప్రసిద్ధమైన స్తుతి శ్లోకం ప్రణవ శ్రీభాష్యాలకు మధ్య గల అర్థసామ్యాన్ని తెలుపుతున్నది. ఈ విధమైన సామ్యాన్నే కాక, శబ్దసామ్యాన్ని కూడా ఈ రెండిటి మధ్య పూర్వాచార్యులు సూచించారు. " అఖిలభువన జన్మ "ఇత్యాదిగా శ్రీ భాష్యం మొదట ప్రణవంలోని మొదటి అక్షరమైన అకారం, తృతీయాధ్యాయం తృతీయపాద శ్రీ భాష్యం ఆరంభంలో "ఉక్తమ్" అని చెప్పబడినందున, అక్కడ ప్రణవంలోని రెండవ అక్షరమైన ఉకారం, శ్రీ భాష్యం " ఇతి సర్వ సమంజసమ్" అని పూర్తి అవుతున్నందున, చివరిలో ప్రణవంలోని చివరి అక్షరమైన మకారం నిక్షేపింపబడినది కనుక, ఈ విధమైన ప్రణవాక్షర విన్యాసం ఈ రెండిటికీ మధ్య గల సామ్యానికి ఒక సంకేతం– అని పూర్వాచార్య సూక్తి. ప్రణవానికి, శారీరక మీమాంసకు మధ్య సామ్యం ఉన్నప్పుడు, ఆ శారీరక మీమాంస వివరణరూపమైన శ్రీభాష్యానికి ప్రణవంతో సామ్యం ఉండడంలో ఆశ్చర్యం ఏమీ లేదు కదా.



# 6. అమలనాదిపిరాన్– శారీరక మీమాంస, శ్రీరామాయణమ్.

"సమ్యఙ్న్యాయకలాపేన మహతా భారతేన చ,
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే"

ఈ శ్లోకం, శ్రుతప్రకాశికలో సుదర్శనసూరివరులచేత అనుగ్రహింపబడిన శ్లోకం. చక్కగా రచింపబడిన న్యాయకలాపంతోనూ, అంటే, బ్రహ్మమీమాంస, పెద్దది అయిన, లేక, గొప్పతనాన్ని కలిగినది అయిన మహాభారతం అనే వేదానికి ఉపబృంహణాలను రచించినవారు, విష్ణుయొక్క ఆవేశావతారమైనవారు అయిన ఆ వేదవ్యాసులకు నేను నమస్కరిస్తున్నాను – అనేది దీని అర్థం.

వేదోపబృంహణాలు అంటే, వేదంలోని అర్థాన్ని తెలియడానికి సహాయంగా ఉండేవి, వేదార్థాన్ని వివరించేవి, వేదోపబృంహణాలు. శ్రీరామాయణ మహాభారత రూపాలలోని ఇతిహాసాలు, 18 పురాణాలు, ఉపపురాణాలు మొదలైనవి ఉపబృంహణాలు. ఈ విధంగా ఉండే ఈ ఉపబృంహణాలను సహాయంగా చేసికొని వేదార్థాలు నిశ్చయింపబడకపోతే, అవి సరిగా విరూపింపబడినవి కావు. ఈ విషయం "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరేదితి" (ఇతిహాస పురాణాల సహాయంతో వేదాన్ని వివరించాలి ఆ విధంగా వేదాలను ఇతిహాస పురాణాలతో వివరించని అల్పశ్రుతుడైనవానిని చూచి వేదం, " నా మనోభావాన్ని వీడు సరిగా వ్యక్తీకరించడం లేదు" అని భయపడుతుంది) అనే సూక్తి తెలుపుతున్నది. ఇటువంటి వేదార్థవివరణరూపాలైన రెండు ఉప బృంహణ గ్రంథాలను వేదవ్యాసమహర్షి అనుగ్రహించారు.

ఈ రెండిటిలో, శారీరకమీమాంస, నాలుగు అధ్యాయాలను కలిగినది. ఒక్కొక్క అధ్యాయానికి నాలుగు పాదాలు ఉన్నాయి. అందుచేత మొత్తం 16 పాదాలు ఈ శాస్త్రంలో ఉన్నాయి. ఈ విధంగా శారీరకమీమాంస 16 పాదాలను కలిగి ఉన్నది. ఒక్కొక్క పాదంలోనూ భగవంతుని ఒక్కొక్క గుణం ప్రతిపాదింపబడింది. అందువల్లనే భగవద్రామానుజులు కూడా భగవంతుని గూర్చి "శ్రుతిశిరసి విదీప్తే" అని అన్నారు. ఈ విధంగా 16 అధ్యాయాలలో ప్రతిపాదింపబడిన భగవంతుని 16 గుణాలను వేదాంతదేశికులు అధికరణ సారావళి అనే గ్రంథంలోని " స్రష్టా దేహీ స్వనిష్ఠః " ఇత్యాది శ్లోకంలో తెలియజేశారు. ఆ 16 గుణాలు ఏవి? అంటే,

1) స్రష్టా– లోకాలను సృష్టించినవాడు, 2) దేహీ –తాను కాకుండా ఉండే అందరినీ తనకు శరీరంగా కలిగి ఉండేవాడు, 3) స్వనిష్ఠః– తననే ఆశ్రయంగా కలిగినవాడు, 4) నిరవధిమహిమా– అంతులేని గొప్పతనాన్ని కలిగినవాడు, 5) అపాస్తబాధః –సాంఖ్యాదిస్మృతులచేత బాధింపబడని వైభవాన్ని కలిగినవాడు, 6) శ్రితాప్తః– ఆశ్రయించినవారికి ఆప్తుడు, 7) ఖాత్మాదేః ఉచితజననకృత్ –ఆకాశం, ఆత్మ మొదలైనవాటిని తగిన రీతిలో సృష్టించినవాడు, 8) ఇంద్రియాదేః ఉచిత జననకృత్ –ఇంద్రియాలు మొదలైనవాటిని తగినట్లుగా సృష్టించినవాడు, 9) సంసృతౌ తంత్రవాహీ– జాగ్రత్ స్వప్న సుషుకప్తి మూర్ఛ మరణం మొదలైన అవస్థలను నిర్వహించేవాడు, 10) నిర్దోషత్వాదిరమ్యః– దోషాలు అంటనివాడు కనుక మనోహరుడు, 11) బహుభజనపదం –అనేక ఉపాసనలకు ఆశ్రయంగా తెలియబడేవాడు, 12) స్వార్హకర్మప్రసాధ్యః– జీవులు తమ తమ ఆశ్రమాలకు, వర్ణాలకు తగినట్లుగా చేసే కర్మల ద్వారా సంతోషించేవాడు, 13) పాపచ్ఛిద్ –పాపాలను పోగొట్టేవాడు, 14) బ్రహ్మనాడీగతికృత్ –మోక్షాన్ని పొందించేవాడు, 15) అతివహన్– జీవుని మోక్షానికి తీసుకొని పోయేవాడు, 16) సామ్యదః – తనతో సారూపాన్ని కలిగించేవాడు– అనే భగవంతుని ఈ పదహారు గుణాలు శారీరకమీమాంసలోని 16 పాదాలలో తెలుపబడ్డాయి.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా",

వేదవేద్యుడైన భగవానుడు శ్రీరామచంద్రునిగా అవతరించినపుడు, వేదం కూడా శ్రీరామాయణంగా అవతరించింది. ఆ శ్రీరామాయణం కూడా "గుణవాన్ కశ్చ వీర్యవాన్" అని ఆరంభించి భగవానుడైన శ్రీరామచంద్రుని 16 కళ్యాణగుణాలకు ఆశ్రయమైనవాడుగా నిరూపించింది.

తిరుమంగై అళ్వార్లు చెప్పినట్లుగా, "పండై నాన్మఱై తానాయ్ నిన్ఱ ఎంబెరుమాన్, వేళ్వియుమ్. తానాయ్ నిన్ఱ ఎంబెరుమాన్, కేళ్వి ప్పదంగళుమ్ తానాయ్ నిన్ఱ ఎంబెరుమాన్ – అండముమ్ తానాయ్ నిన్ఱ ఎంబెరుమాన్" (అనాది అయిన వేదమై ఉన్నవాడు భగవంతుడు, యాగాలు తానై ఉండేవాడు భగవంతుడు, ఈ బ్రహ్మాండం తానై ఉండేవాడు భగవంతుడు) అనే భగవానుడు కదా, మనవంటివారి భౌతికనేత్రాలకు కూడా లక్ష్యం అయ్యేటట్టుగా విలక్షణమైన దివ్యమంగళవిగ్రహాన్ని స్వీకరించి, శ్రీరంగంలోని దివ్యాలయంలో ఆదిశేషశయనంపై పరుండి ఉన్నాడు. ఆ స్వామికి కూడా 16 కళ్యాణ గుణాలు ఉన్నాయి–

అని "వాయ్ త్త పుకఴ్ పాణర్ " అని ప్రశంసింపబడే తిరుప్పాణ్ ఆళ్వారులు తాము అనుగ్రహించిన అమలనాది పిరాన్ దివ్యప్రబంధంలోని మొదటి పాశురంలో వ్యక్తం చేశారని వేదాంత దేశికులు మునివాహనభోగం అనే అమల నాది పిరాన్ వ్యాఖ్యానంలో అద్భుతంగా వ్యాఖ్యానించారు. ఆ వివరాలను కొన్నిటిని యథాశక్తి అనుసంధించుకుందాం.

"ప్రపద్యే ప్రణవాకారం భాష్యం రంగమివాపరమ్,
పరస్య బ్రహ్మణో యత్ర శేషిత్వం స్ఫుట మీక్ష్యతే"

ఈ శ్లోకాన్ని శ్రీసుదర్శనసూరి అనుగ్రహించారు. శ్రీరంగవిమానం అయిన ప్రణవాకార విమానంవలె శ్రీభాష్యం కూడా ప్రకాశిస్తున్నది– అని ఇందులో వారు అంటున్నారు. ఈ ప్రణవాకార విమానం తనలో అంతర్భవించుకొన్న తత్త్వం ఎటువంటిది? అని అంటే, దానిని కులశేఖర ప్పెరుమాళ్ ప్రబంధంలోని మొదటి పాశురంలో "ఇరుళిరియ చ్చుడర్ మణిగళ్ ఇమైక్కుమ్ నెఱ్ఱి ఇన త్తుత్తి అణి పణమ్ ఆయిరంగళ్ ఆర్ న్ద అరవరశ ప్పెరుంజోది అనంతనెన్నుమ్ అణి విళంగుమ్ ఉయర్ వెళ్ళై అణైమై మేవి " (శ్రీరంగంలో చీకటి అంతా తొలగిపోయేటట్లుగా కాంతులను విరజిమ్మే మణులతో కూడిన వెయ్యి పడగలను కలిగినవాడై, తేజోమయుడైన ఆదిశేషుడు అనబడే అందమైన తెల్లని పాన్పుపై శయనించి ఉండే శ్రీరంగనాథుడు) అని ఆ ఆదిశేష శయనంపై పరుండి ఉండే భగవంతుడే– అని అన్నారు. ఆ తత్త్వాన్నే పాణ్ పెరుమాళ్ పాదాదికేశాంతంగా అనుభవించారు. తమ అనుభవాన్ని అమల నాది పిరాన్ అనే పది పాశురాలను కలిగిన, అద్భుతమైన దివ్యప్రబంధ రూపంగా ఆవిష్కరించారు. అందులోని మొదటి పాశురంలో, శారీరక మీమాంసలోవలె, శ్రీరామాయణంలోవలె, 16 గుణాలు ఆవిష్కరింపబడ్డాయని వేదాంతదేశికులు మునివాహన భోగం అనే తమ వ్యాఖ్యానంలో వివరించారు.

అమలన్ ఆది పిరాన్ ★ అడియార్క్కెన్నై ఆట్పడుత్త
విమలన్ ★ విణ్ణవర్ కోన్ ★ విరైయార్ పొఴిల్ వేంగడవన్ ★★
నిమలన్ నిన్మలన్ నీది వానవన్ ★ నీళ్ మదిళ్ అరంగత్తమ్మాన్ ★
తిరుక్కమల పాదమ్ వందు ★ ఎన్ కణ్ణిన్ ఉళ్ళన ఒక్కిన్దదే
అనేది మొదటి పాశురం.

ఈ పాశురంలో ఉండే 16 పద ప్రయోగాల ద్వారా ఏ విధంగా భగవంతుని 16 గుణాలు ఆవిష్కరింపబడ్డాయో, ఆ క్రమాన్ని ఇప్పుడు చూద్దాం.

## 1) మోక్ష ప్రదత్వం

భగవంతుని ఈ గుణం ఇక్కడ "అమలన్ "అనే మొదటి పదం ద్వారా తెలియజేయబడింది. హేయ ప్రతిభటుడు అని దీని అర్థం. హేయ ప్రతిభటత్వం అంటే, తాను ఏ విధమైన దోషాలను కలిగి ఉండకపోవడమే కాకుండా, తన సంబంధంతో ఇతరులలో ఉండే దోషాలను కూడా పోగొట్టి, వారిని పరిశుద్ధంగా చేసేవాడు –అని అర్థం– అని మన పూర్వాచార్యులు ఈ గుణాన్ని వ్యాఖ్యానించారు. "బృహత్వాత్ బృంహణత్వాచ్చ " అని బ్రహ్మ శబ్దానికి ఇదే అర్థంగా పురాణాలలో చెప్పబడింది. దీనివల్ల మోక్ష ప్రదత్వం చెప్పబడింది. జీవునకు కల, అనాది అయిన సంసార సంబంధం అనే దోషాన్ని తీర్చి,

మోక్షాన్ని అనుగ్రహించేవాడు కదా, భగవానుడు.

## 2) జగత్కారణత్వం

భగవంతుని ఈ గుణం ఈ ప్రబంధంలోని "ఆది" అనే రెండవ పదం ద్వారా తెలుపబడింది. ఆది అంటే –మొదలు అని అర్థం. అందు చేత ఈ వదం ద్వారా జగత్కారణం చెప్పబడింది. నమ్మాళ్వారులు కూడా "వేర్ ముదలాయ్ విత్తాయ్" అని అంటూ భగవంతుని సర్వవిధ కారణత్వాన్ని అనుసంధించారు. "అమలన్, ఆది" అనే ఈ రెండు పదాల ద్వారా శ్రీరంగనాథుని హేయప్రత్యనీకత్వం, కల్యాణ గుణాకరత్వం చెప్పబడింది– అని నాయనార్ అనే ఆచార్యులు వ్యాఖ్యానించారు. జగత్కారణత్వం మోక్ష ప్రదత్వం– అనే ఇవి, చత్రచామరాల వలె, సర్వలోక శరణుడైన భగవంతుని విశేషచిహ్నాలు అని దేశికుల మునివాహనభోగం తెలుపుతున్నది.

## 3) సర్వ ప్రకారోపకారకత్వం

ఈ గుణం మూడవ పదం అయిన "పిరాన్ "అనే పదం ద్వారా చెప్పబడింది. "పిరాన్" అంటే ఉపకారకుడు– అని అర్థం. భగవంతుడు జీవుల యొక్క సత్తా స్థితి ప్రవృత్తులను తన అధీనంలో కలిగినవాడై నిర్వహిస్తున్నాడు. ప్రళయ సమయంలో రక్షించడం, సృష్టి చేసేటప్పుడు జీవులకు కరణకళేబరాలను ఇవ్వడం, వరకు ఉండే భగవంతుని కృపా పరీవాహకమైన కార్యాలు అన్నీ ఇక్కడ చెప్పబడ్డాయి. దీనివల్ల, అన్ని విధాలుగాను భగవంతుడు ఉపకారకుడు అని చెప్పబడింది.

## 4) సారతమమైన భగవంతుని ఉపకార విశేషం

ఇక్కడ, సారతమమైన, భగవంతుడు మనకు చేసే ఉపకార విశేషం ఒకటి గమనించవలసి ఉన్నది. ఈ ఉపకార విశేషం. ఇక్కడ "అడియార్ క్కు ఎన్నై ఆట్పడుత్త విమలన్" (తన భక్తులకు నన్ను దాసునిగా చేసిన విమలుడు) అనే సూక్తి ద్వారా తెలియజేయబడింది. భగవంతుని ఆశ్రయించడం కంటే, ఆ స్వామి భక్తులను ఆశ్రయించడం అనేది గొప్పది కదా. "మదుర కవి శొల్పడియే నిలైయాక ప్పెఱ్ఱోమ్" (మధురకవులు ఆచరించిన చరమ పర్వనిష్ఠను స్థిరంగా కలిగినవారమయ్యాము) అని ఆర్తి ప్రబంధంలో శ్రీవరవరమునులు పలికినది దీనిని గూర్చియే. దీనిని ముని వాహన భోగంలో దేశికులు " అతోహమపి తే దాసః– అని చేసిన ఉపకారం కంటే, " ఉఱ్ఱదుమ్ ఉన్నడియార్ క్కడిమై" (నీ అష్టాక్షరీ మహా మంత్రం లోని అర్థాన్ని అధ్యయనం చేసిన నేను భాగవత శేషత్వమే దాని పరమార్థంగా గ్రహించాను) అనే విధంగా అనుగ్రహించిన భాగవత శేషత్వం కంటే మించిన ఒక ప్రకారం ఉంటుందా! "అని అన్నారు. శ్రీరంగామృత కవి కూడా దీనిని చరమంలో చరమంగా అనుసంధిస్తూ, "ఉన్ తొండర్ కట్కే అన్బుఱ్ఱు ఇరుక్కుంబడి ఎన్నై ఆక్కి " (భక్తుల విషయంలో భక్తిని కలిగి ఉండేటట్లుగా నన్ను సంస్కరించి) అని భగవద్రామానుజులను ఉద్దేశించి ప్రార్థించారు.

## 5) నిత్యనిర్దోషత్వం

ఈ గుణం "విమలన్" అనే పదం ద్వారా తెలుపబడింది. దీనివల్ల గొప్పగా ప్రకాశించే స్వభావం చెప్పబడింది. తద్ద్వారా భగవంతుని బద్ధముక్త వ్యావృత్తి చెప్పబడింది. బద్ధులకు, ముక్తులకు దోష సంబంధం ఉన్నది కదా. ఇక్కడ " అవికారాయ శుద్ధాయ" అనే శ్రీవిష్ణు పురాణ శ్లోకార్థం అనుసంధింపబడింది– అని గమనించాలి.

## 6) నిత్యసూరి నిర్వాహకత్వం

భగవంతుని ఈ గుణం ఇక్కడ "విణ్ణవర్ కోన్", అనే ప్రయోగం ద్వారా చెప్పబడింది. ఈ ప్రయోగానికి నిత్య సూరులకు ప్రభువు, వారిచే సే సేవింపబడేవాడు – అని కదా అర్థం. శ్రీపరాశర భట్టర్ శ్రీ గుణ రత్న కోశం అనే స్తోత్రంలో " తే సాధ్యాః సంతి దేవాః జనని గుణవపుర్వేషవృత్త స్వరూపైః" (27) అనే శ్లోకంలో " అమ్మా,! శ్రీరంగనాయకీ! పరమపదంలో ఉండేవారై, దివ్య దంపతుల విషయంలో ఉండే భక్తి అతిశయంచేత వికారాన్ని పొంది, కలత చెందిన హృదయాలు కలవారై, నిత్యులు ఆ దివ్య దంపతులకు సేవ

చేసి ఆనందాన్ని అనుభవిస్తున్నారు. వారు, నీ భర్త అయిన పరమాత్మకు నీకు చేసే కైంకర్యవృత్తిలోనే ఎల్లప్పుడూ ఉంటున్నారు –అని అనడాన్ని గమనించవచ్చు.

## 7) నిత్యవిగ్రహవత్త్వమ్

"విణ్ణవర్ కోన్" అని అనడం ద్వారా సూరిసేవ్యమైన పరరూపం చెప్పబడినది– అని అన్నారు, దేశికులు, మునివాహన భోగంలో. భగవంతుడు పరమపదంలో విగ్రహంతో కూడినవాడై ఉండే సన్నివేశం దీనివల్ల చెప్పబడింది. భగవంతునకు రూపం లేదు– అనేవారి పక్షం ఇక్కడ నిరసింపబడింది.

## 8) సర్వసులభత్వం

"విరైయార్ పొழిల్ వేంగడవన్" (సువాసనలను వెదజల్లే తోటలను కలిగిన వేంకటాచలంలో ఉండేవాడు) అని అనడం వల్ల పరమపదంలో నిత్యులకు తనను అనుగ్రహించడం మాత్రమే కాదు, ఈ భూలోకంలో ఉండేవారు కూడా తనను ఆశ్రయించడం కోసం సులభుడై, తిరుమలలో వచ్చి నిత్యవాసం చేస్తున్నాడు– అని– చెప్పబడింది. "వానోర్ క్కుమ్ మణ్ణోర్ క్కుమ్ వైప్పు" (పరమపద వాసులకు, భూలోక వాసులకు గొప్ప నిధి) కదా, శ్రీవేంకటాచలం

## 9) వాత్సల్యం

ఈ గుణం "నిమలన్ "అనే పదం ద్వారా చెప్పబడినది. భక్తులకు ఉపకరించడం తనకే ఉపకారం చేసుకొన్నట్లుగా భావించే భావశుద్ధిని కలిగినవాడు– అని దీని అర్థం. దీనివల్ల, లక్ష్మీదేవితో పాటుగా ఎవరైనా సరే, భక్తుల విషయంలో దోషాలను పలికితే, " నా భక్తులు దోషాలను చేయరు, వారు చేసినది అంతా మంచే" అని భావించి గ్రహించే వాత్సల్య విశేషం కలవాడు –అని చెప్పబడింది.

## 10) సౌశీల్యం

ఈ గుణం ఇక్కడ "నిన్మలన్ " అనే పదం ద్వారా చెప్పబడింది. భక్తులతో కలిసే టప్పుడు, వారిలో ఉండే తారతమ్యాలను గమనించి, కలిసే దోషం లేనివాడు– అని అర్థం.

విమలన్, విణ్ణవర్ కోన్, విరైయార్ పొழిల్ వేంగడవన్, నిమలన్, నిన్మలన్ " అనే ఈ ఐదు పదాల ద్వారా జ్ఞానం, స్వామిత్వం విగ్రహయోగం, సౌశీల్యం, సౌలభ్యం, వాత్సల్యం అనేవి ప్రతిపాదింపబడడం చేత నారాయణపదార్థం, దానికి పైన వచ్చిన చతుర్థీవిభక్తిచేత ప్రతిపాదింపబడే కైంకర్యం చెప్పబడ్డాయి.

## 11) కైంకర్యోద్దేశ్యత్వం (కైంకర్య ప్రతిసంబంధిత్వం)

ఈ గుణం ఇక్కడ" నీది "అనే పదం చేత చెప్పబడింది. నీతి అంటే, క్రమం. ఇక్కడ నీతి ఏమంటే, భక్తులు చేసే సేవలను స్వీకరించడమే. అటువంటి క్రమం నిరపాయంగా ఉండేది పరమపదంలోనే కదా.

## 12) కైంకర్యస్థాన విశేషాన్ని కలిగి ఉండడం

భగవంతుడు నిత్యముక్తుల నుండి నిత్యమైన కైంకర్యాన్ని స్వీకరించే చోటు పరమపదం. ఆ పరమపద స్వరూపాన్ని శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశంలో

**"యద్దూరే మనసో యదేవ తమసో పారే యదత్యద్భుతం**
**యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః,**
**సాయుజ్యస్య యదేవ సూతి రథవా యత్ దుర్గ్రహం మద్గిరాం**
**తద్విష్ణోః పరమం పదమ్" (21)**

(ఏ చోటు మనసుకు దూరంగా ఉన్నదో, ఏ చోటు ప్రకృతికి ఆవలి వైపున ఉన్నదో, ఏ చోటు చాలా ఆశ్చర్యాన్ని కలిగించేదిగా ఉన్నదో, ఏ చోటు కాలం వల్ల ఏ విధమైన మార్పును పొందదో, ఏ చోటును ఉద్దేశించి వెళ్లినవారికి దేవతల నగరమైన అమరావతి కూడా నరకంగానే అవుతున్నదో, ఏ చోటు ముక్తి దశకు జన్మస్థానమో, అది, భగవంతుడైన విష్ణువు యొక్క, గొప్పదైన స్థానం అయిన పరమ పదం) అనే శ్లోకంలో అనుగ్రహించారు.

ఈ విషయం ఇక్కడ ప్రస్తుత పాశురంలో "నీదివానవన్", అనే ప్రయోగంలోని ", వానవన్" అనే పదం చేత తెలుపబడిందని దేశికుల అభిప్రాయం. "వానమ్" అనే పదానికి ఆకాశం అనే అర్థమే కాకుండా, పరమాకాశ శబ్దం చేత చెప్పబడి పరమపదం కూడా అర్థమే కదా.

## 13) సర్వస్వామిత్వం

ఈ గుణం, ఇక్కడ, " అమ్మాన్ " అనే ప్రయోగంతో చెప్పబడింది. పరమపదానికి, ఈ లీలావిభూతికి రెండిటికీ స్వామి అయినవాడు –అని ఇక్కడ ఈ ప్రయోగం ద్వారా చెప్పబడింది కదా. పరమపదం "కొడియణి నెడుమదిళ్"కాగా, శ్రీరంగం "నీళ్ మదిళ్".

## 14) శ్రీచరణాల పావనత్వం

ఈ గుణం ఇక్కడ "తిరుక్కమల పాదమ్" అనే ప్రయోగం ద్వారా చెప్పబడింది. భగవంతుని శ్రీచరణాలై ఉన్నందున పావనత్వం. "తుయరఱు శుడరడి" కదా.

## 15) శ్రీచరణాల భోగ్యత్వం

దీనితో పాటుగా, ఇక్కడ, పద్మంతో పోల్చబడడం చేత భగవంతుని శ్రీపాదాల భోగ్యత్వం చెప్ప బడింది. అవి, ఆశ్రితులకు భోగ్యమై ఉండడమే కాకుండా, భగవంతునకు కూడా అవి చాలా భోగ్యాలుగానే ఉంటాయి. వటపత్ర శాయి వృత్తాంతం దీనికి ఉదాహరణ. బాలకృష్ణుని విషయంగా పెరియాళ్వార్లు "పేద క్కుழవి పిడిత్తు శువైత్తుణ్ణుమ్ పాదక్కమలంగళ్ " (తన నోటిలో పెట్టుకుని ఆస్వాదించే చిన్ని కృష్ణుని పాద కమలాలను చూడండి) అని ఈ సన్నివేశాన్ని అనుభవించి, అనుగ్రహించారు

## 16) భగవంతుని అనన్యమైన దృష్టితో అనుభవించ గలగడం

ఇటువంటి భోగ్యమైన, పరమ పవిత్రమైన భగవంతుని శ్రీపాదాలు "వందు" అని చెప్పిన విధంగా అళ్వారులు ఉండే చోటు వరకు వచ్చి చేరాయి.

బ్రహ్మాసనక సనందనాదులు కూడా చూడడానికి అరుదైనవై ఉండగా, "కాట్టవే కండ పాదకమలమ్" అని చెప్పిన విధంగా భగవంతుడు నాకు స్వయంగా అనుగ్రహించాడే! – అని ఆశ్చర్యపడి "వందు ఎన్ కణ్ణిన్ ఉళ్ళన ఒక్కిన్దదే" అని పలుకుతున్నారు. ఇక్కడ, ", యమేవైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూమ్ స్వామ్" (భగవంతుడు ఎవనిని వరిస్తాడో, అతడికే లభిస్తాడు. ఆ భక్తునకు తన దివ్యమంగళ విగ్రహ దర్శన భాగ్యాన్ని కలిగిస్తాడు) అనే శ్రుతిలోని అర్థం అనుసంధింపబడింది.

ఇందువల్ల, భగవంతుని అనుభవించినప్పుడు, భక్తుని మనసు ఇక ఏ విషయంలోనూ పోదు– అని, అటువంటి గుణాన్ని భగవానుడు కలిగినవాడు కనుక, భూమాధికరణంలో చెప్పబడిన అర్థం ఇక్కడ సూచింపబడుతున్నదని చెప్పవచ్చు.

ఇంతే కాక, ఈ ప్రబంధంలో చివర ఈశ ఆళ్వారులే "ఎన్ అరంగనై క్కండ కణ్ గళ్ మற்றொన్నినై క్కాణావే" (నా శ్రీకరంగనాథస్వామిని చూచిన నా కన్నులు, ఇక ఏ వస్తువును చూడవు) అని ఈ విషయాన్ని కంఠోక్తిగా పలికారు. అందువల్ల ఈ ప్రబంధం మొత్తం భూమాధికరణ సారమని కూడా చెప్పవచ్చు.

ఈ విధంగా అమల నాది పిరాన్ ప్రబంధం భగవంతుని 16 గుణాలను తెలియజేయడంలో శారీరకమీమాంసతో, శ్రీరామాయణంతో సామ్యాన్ని కలిగి ఉన్నది. స్వస్తి.

★★★★★